# బాపు - నా తల్లి

కుమారి మనూ గాంధి

అనువాదకుడు :

నండూరి వెంకట కృష్ణమాచార్యులు .

సర్వోదయ సాహిత్య మందిర్

హుసేని అలం రోడ్డు :: హైదరాబాదు (దక్కన్)

# ప్రస్తావన

'భావనగర్ సమాచార్' లో కుమారి మనూ బహన్ వ్రాసిన ఈ పదిహేను వ్యాసాలు పాఠకులకు ఆనందం కలిగించక మానవు. ఇదే ఆమె ప్రథమ ప్రయత్న మనుకుంటాను. పూజ్యుడైన మహాత్ముని స్వభావాన్ని, చివరి రోజులలో ఆయన చేసిన పనిని చక్కగా విశదపరచ టమే ఈ వ్యాసాలలోని గొప్పతనం. 1946వ సంవత్సరం చివరనుండి మనూ బహన్ ఆయన సమక్షంలోనే ఉండి తాను చూచినదంతా డైరీలో వ్రాస్తూవచ్చింది. నోఆఖాలీ యాత్ర ఆరంభంనుండి 'బాపు' జీవితాంతం వరకూ ఆయన వెంట ఉండింది, అందువలనే ఈమె 'డైరీ' కి చాలా మహత్వం వచ్చింది. అట్టి 'డైరీ' ఉంచినందుకు పాఠకులు ఆమెకు కృతజ్ఞులుగా ఉండకమానరు. ఆమె గుజరాతీ వ్యాసాలను ఆమె స్నేహి తురాలు శ్రీ కురంగీ బహన్ దేశాయి హిందీలో అనువాదం చేసింది.

స్వయంగా పూజ్యుడగు 'బాపు' మనూ బహన్‌కు తల్లి అయినాడు. దానివల్లనే ఈ పుస్తకానికి పెట్టినపేరు సార్థక మవుతున్నది.

బొంబాయి, 22—1—1949.

కిశోరిలాల్ మశరూవాలా.

# విషయసూచిక

# ౧. 'బా,* బాపు†'ల ఒడిలో

ఎంతమందో పుత్రీ పుత్రులకు 'బాపు' తండ్రి. ఎంత మందో శిష్యులకు గురువు. సోదరీ సోదరుల కెందరికో సోదరుడు. ఎందరికో చిన్నాయన, ఎందరికో వైద్యుడు, డాక్టరు, సేవకుడు. అనేకమందికి మిత్రుడు. దుఃఖితు లెందరికో ఆయన ఉద్ధారకుడు. వేయేల 'రాష్ట్రపిత' అని ఆయనను పిలుచుట లోనే యివి అన్నియు యిమిడియున్నవి. కాని నాకు మాత్ర మాయన తల్లియే. సాధారణముగా పురుషుడు ఎవ్వరికిని తల్లి కానేరడు. ఏలనన వాత్సల్యముతో నిండిన మాతృహృదయ మును భగవంతుడు పురుషుల కియ్యలేదు. స్త్రీల కొక్కరికే యిచ్చెను. కాని 'బాపు' పురుషుడైయుండియు పరమేశ్వర ప్రసాదమైన ఆ దివ్యశక్తియందుకూడ భాగము పంచు కొనినాడు.

ఏవిధముగా ఒక తల్లి తన బిడ్డను పోషించి పెంచు కొనునో—అదే విధముగా 'బాపు' నన్ను పోషించి పెంచి నాడు. అయితే ఆయన దగ్గర ఎంతమందో ఆడపిల్లలు పెరిగి పెద్దవారైనారు. కాని 'బాపు' నాతో మాటిమాటికి

---

* 'బా' అంటే గుజరాతీ భాషలో అమ్మ అని అర్థము.

† 'బాపు' అంటే తండ్రి అని అర్థము.

" నేను నీకు తల్లినయినానుగదా ? నే నెంతమందికో తండ్రిని. కాని నీకు ఒక్కదానికే తల్లిని," అని చెప్పేవాడు.

పిల్లల జీవితముల తీర్చి దిద్దుటలో తండ్రికూడ అన్ని విధముల పాల్గొనుట లోకాచారము. కాని ఆడపిల్లల విషయమై తల్లి తీసుకొను శ్రద్ధమీదనే వారి భవిష్యత్తు అంతా ఆధారపడి ఉంటుంది. నేడుకూడ పిల్ల అత్తవారింటికి వెళ్లినప్పుడు తెలివి తేటలతోను, మెళకువతోను నడచుకొనక పోతే అత్త గారుకాని, ఆడబిడ్డకాని—" ఆఁ! తల్లి ఏమైనా నేర్పిందా ?" అని ఎత్తి పొడుస్తారు. తండ్రిని ఎవ్వరూ తప్పు పట్టరు.

1942వ సంవత్సరంలో పూజ్యురాలగు కస్తూరిబా జైలులో ఉన్నప్పుడు నేనుకూడ జైలులో ఉన్నాను. కాని అది నాగపురం జైలు. అప్పుడు నా వయస్సు పధ్నాలుగేండ్లు మాత్రమే. నన్ను కన్న తల్లి నా పన్నెండవ ఏటనే నన్ను యీ లోకంలో వదలి వెళ్లిపోయింది. కాని ఆవిడ ఆశీర్వాదం వల్ల కొలదికాలంలోనే నాకు కస్తూరిబా ఒడి దొరికింది. కస్తూరిబా నాకెప్పుడు తల్లిలేని లోటు కనబడనిచ్చేదికాదు. 1942వ విప్లవంలో ఆంగ్లేయ ప్రభుత్వం 'బా, బాపు' లను జైల్లో పెట్టినప్పుడు నేను వారిద్దరినుండి వేరు చేయబడినాను. కాని, నా అదృష్టంవల్ల నాగపురం జైలులో నేను తొమ్మిది నెలలున్న తర్వాత—అలౌకికమైన ఆ మాతసేవ చేయు

అవకాశం నాకు మరల దొరికింది. మమతాపూర్ణమైన ఆ తల్లి ఒడిచేరు భాగ్యం నా కబ్బింది. 'బా' దర్శన భాగ్య మబ్బు నని కలలోనైన నేనాశించలేదు. కాని మానవుని శ్రద్ధా భక్తులు పూర్తిగా నిష్ఫలము లెన్నటికి కావుగదా ?

'బాపు' ఉపవాస వ్రతము తర్వాత 'బా'కు గుండె జబ్బు వచ్చింది. మాటిమాటి కామెకు జబ్బు ఎక్కువ అగు చుండేది. 'బా' అప్పుడు "మనూను పిలిపించ గలిగినచో నాకింకెవ్వరు అక్కరలేదు," అని చెప్పింది. ఆ సమయముననే 'బా' గుండె జబ్బు పూర్తిగ తిరుగబెట్టింది. సుశీలాబహన్, డాక్టరు గిల్డరులకు సహాయపడుటకు 'నర్సు' కావలసి వచ్చింది. ఎందుకన వీరిద్దరే 'బా, బాపు' లను చూస్తూ ఉండేవారు. నాకోసం వారు ప్రభుత్వాన్ని అడిగినారు. కాని ప్రభుత్వమప్పుడు తలక్రిందు వ్యాపారంలో ఉంది. రాజకీయ ములన్న ఏమిటో తెలియని నావంటి చిన్నదానిని మహాత్ముని దగ్గరకు పంపుటలో అపాయమున్నదని ఎట్లనుకున్నదో నాకర్థము కాలేదు. చివరకు రాజాజీ, దేవదాసు గాంధిగారలు ఈ విషయమై సర్ టోటన్ హామ్, లిన్ లిత్ గో గార్లతో తీవ్రంగా వాదించవలసి వచ్చింది. వారిద్దరు సఫలులైరి. నన్ను నాగపురం జైలునుండి ఆగాఖాను మహలునకు పంపించిరి. 'బాపు, బా' ల వద్దకు నన్ను వెళ్లమన్నప్పుడు చాలమందికి

ఆశ్చర్యం కలిగింది. "మేమింతకాలంనుండి 'బాపు' దగ్గర ఉన్నాము. మా కెందుకీ అవకాశం దొరకలేదు. ఈపిల్ల అక్కడ 'బా' కు ఏమి సేవచేయ కలుగుతుంది?" అని వారందరు తమలో తాము చర్చించుకొన సాగిరి. కాని చిన్నప్పటినుండి కూడ భగవంతునిపై నాకెట్టి శ్రద్ధాభక్తులు గలవో, అట్టి శ్రద్ధాభక్తులే 'బా, బాపు' ల మీద నాకుండినవి.

దీనికిముందు పూజ్యుడగు 'బాపు' ఉపవాస వ్రత మప్పుడు నాతండ్రి ఆయనను చూచుటకు జైలుకు వెళ్లగా 'బా' నా సంగతి అడిగింది. దానికి ఆయన—"మనూ చాల నీరసపడింది. దాని కండ్లు పాడయి పోయినవి" అని 'బా' కు చెప్పినాడు. అప్పటినుండి 'బా' మాతృ హృదయం తన బిడ్డను చూడ తహతహ లాడసాగింది. నేను ఆగాఖాను మహాలు ద్వారము సమీపించునప్పటికి దయార్ద్ర మగు ముఖముతో 'బా' అక్కడ నిలబడి ఉండింది. జైలు నియమాల ప్రకారం నా సామానును జైలు సూపరెంటెం డెంటు సోదాచేయ మొదలుపెట్టగా 'బా' అధీరయై నానుండి పెట్టె తాళపుచెవిని తీసికొని నన్ను లోనికి వదల మని సూపరెంటెండెంటుతో చెప్పింది.

ఇంతటి ప్రేమార్ద్ర హృదయమగు మాతసేవ చేయు సౌభాగ్యము నాకు పదమూడు నెలలు లభించింది. ఇదివరకు

వలెనే నా స్నానము, భోజనము, చదువు, వ్రాత, పని, నిద్ర మున్నగునవి అన్నియు ఆమె చెప్పు చేతలలోనే జరుగసాగినవి. భగవంతుడు నాయెడ చూపించిన ఈ దయకు హృదయ పూర్వకముగా నే నాయనకు దండము పెట్టుచుండెడిదానను. చలి ఎక్కువగుటవల్లగాని, దమ్మ (ఉబ్బసము) వల్లగాని 'బా' కు నిద్రరానప్పుడు నా పక్కమీదకు వచ్చేది, లేదా నన్ను తన దగ్గరకు తీసికొనివెళ్లి—"అమ్మా! నీవు నిద్రపో. దినమంతయు పనిచేసి అలసినావు. నాకు నిద్ర వచ్చుటలేదు. అందుచేత నిన్ను నావద్ద పడుకొన బెట్టుకొన్నాను," అని చెప్పేది. తల్లి తన చిన్నబిడ్డను నిద్రబుచ్చునట్లు జోకొట్టి నన్ను నిద్రపుచ్చేది.

1944వ సంవత్సరం, ఫిబ్రవరి 22వ తేదీన, ప్రేమమయి అగు ఈ నాతల్లిని ఈశ్వరుడు తీసికొనిపోయినాడు. ఆరోజున ఆమె తల దిక్కున కండ్ల నీరు కార్చుచు రాయివలె నేను నిలబడి ఉంటిని. 'బాపు' ఒడిలో తలనుంచుకొని రామనామ స్మరణ చేయుచు, పవిత్రమైన గీతాశ్లోకముల చదువుచు, ఈ ప్రపంచమునుండి శాశ్వతముగా, ఆమె సెలవు పుచ్చుకొనుచుండుట చూచుచుంటిని. 'నా తప్పుల క్షమించుడు' అని 'బా' అందరిని అడుగుచు నాతోకూడ నిట్లన్నది— "అమ్మా! నీవు నాకు చాలా సేవ చేశావు. భగవంతుడు

నిన్ను సౌఖ్యవంతురాలినిగా చేయుగాక!" నా తండ్రి గారితో—"ఇప్పుడు మనూను తీసుకొనివెళ్లి చదివించవలసింది," అని చెప్పింది. 'బాపు' తో "నేనింక పోవుచున్నాను," అని పల్కింది. బాపు కండ్లనుండి కూడ రెండు కన్నీటిబొట్లు జారినవి.

పది పదిహేనేండ్ల నా జీవితంలో నే నెవ్వరి చావును గాని, శవమునుగాని, చితినిగాని చూడలేదు. మొట్ట మొదట చూచినది పూజ్యురాలగు కస్తూరిబాది. రెండవది 'బాపూ' దే. దీనికి లోకం—"ఎంత అదృష్టవంతురాలు ఈ పిల్ల! 'బా, బాపు' ల దగ్గర వారి అంత్య ఘడియల వరకున్నది," అని అంటుంది. కాని నేను అదృష్ట వంతు రాలినో కాదో యింతవరకు నేనొక నిర్ణయానికి రాలేదు.

'బా' పోయిన తర్వాత కొద్దికాలం నాకు ఈశ్వరునిపై శ్రద్ధ తగ్గిపోయింది. "ప్రాణం పోయేవరకు నా యోగ క్షేమాల నింత బాగుగా విచారించుచుండిన తల్లిని భగవంతుడు ఏల ఎత్తుకపోయాడు," అని నేను విచారింప సాగితిని. 'బాపు' నన్ను భజన కీర్తన పాడమంటే అజ్ఞానంవల్ల "ఈశ్వరుడు నా 'బా'ను తీసుకొనిపోయాడు. ఇక నే నాయన పేరైన ఎత్తను," అని అన్నాను. అప్పుడప్పుడు

యిట్టి అజ్ఞానానికి కూడ అద్భుత ఫలితం కలుగుతుంది. ఇది నా అనుభవంలోని మాట.

ఆరోజు రాత్రే 'బా' దహనము చేయబడిన తర్వాత, 'బాపు' నన్ను తనదగ్గరకు పిలిచి 'బా' వస్తువుల ఎన్నింటినో నా చేతిలో పెట్టినాడు. అందులో బంగారం పొదుగబడిన పాత దంతపుగాజులు రెండు, తులసిమాల, ఆమె జుట్టు కట్టుకొనుదారము, ఆమె నిత్యం ఉపయోగించే కుంకుమ, పాదుకలు మున్నగునవి ఉన్నాయి. వాటిని నా చేతుల్లోపెట్టుతూ 'బాపు'—"చూడమ్మా! 'బా' నిన్ను చాలా పొగిడింది. అందుకనే ఆవిడ ఈ ఆఖరి వస్తువుల కన్నింటికీ నీవే యజమానురాలవు. నేనుకూడ నీకే వీటిని యిచ్చుటకు నిశ్చయించాను. భరతుడు రామపాదుకల సింహాసనం మీదపెట్టి వాటినుండి ప్రేరణ పొందినట్లు నీవుకూడ యీ వస్తువులనుండి ప్రేరణ పొందుము. 'బా' ఎట్టి సతి! మణుగులకొలది కట్టెల మంటనుండి సురక్షితంగా బయటపడిన ఈ గాజులే* ఆమె సతీత్వమునకు ప్రబల తార్కాణము," అని అన్నాడు.

---

* మహారాష్ట్రదేశపు ఆచారం ప్రకారం మేము 'బా' కడుపుమీద పచ్చనిగాజుల జతలు ఆరు, కొబ్బరికాయ, నువ్వులు మున్నగు వస్తువులు పెట్టినాము. పగలకుండగనే ఆ గాజులన్నీ రెండవ రోజున బూడిదలో దొరికినవి. సతీతిలకమగు ఆ మాత ప్రసాదంగా ఆ గాజులలో ఒకటి నేటికిని నావద్ద నున్నది.

ఇక నా సంగతి. నన్ను 'బా' కొరకే అక్కడ ఉండనిచ్చింది కాబట్టి, ప్రభుత్వం నన్ను 'బాపు'వద్ద ఉండ నియ్యదని చర్చ మొదలైంది. మధ్యప్రదేశ ప్రభుత్వం నన్నెప్పుడో జైలునుండి వదలివేసింది. కాని 'బా' జబ్బుగా ఉండటంవల్ల ఆమె సేవచేయుటకు నన్ను ఆగాఖాను మహాలులో ఉండనియ్యవలసిందని నేను ప్రభుత్వాన్ని కోరితిని. ప్రభుత్వం అందులకు ఒప్పుకొన్నది. కాని ఇప్పుడు అక్కడ నా అవసరంలేదు. 'బా' నుండి విధాత వేరుచేస్తే చేశాడు కాని యిప్పుడు 'బాపు'నుండికూడ నన్ను వేరుచేస్తాడేమో అన్నభయం నన్ను పట్టుకొన్నది. అది తలచుకొని నేను దుఃఖపడసాగితిని. ఒకరోజురాత్రి నిద్రలో ఉలికి, ఉలికిపడి లేవసాగితిని. ఒకటి రెండుసారులు సుశీలాబహాన్, 'బాపు' నా మంచమువద్దకువచ్చి జోకొట్టి నన్ను నిద్రపుచ్చినారు. ఆ మరునాడు 'బాపు' మౌనదినం. ఆయన చాలా ప్రొద్దున్నే, అనగా నాలుగు గంటలకే నాకొక ఉత్తరం వ్రాసి పెట్టినాడు—

చిరంజీవి మనూ,

నీవు రాత్రి సరిగా నిద్రపోలేదు. నిన్ను, ప్రభావతిని (జయప్రకాశనారాయణ భార్య) యిక్కడ ఉంచుకొనే విష యంలో పెద్ద ఉత్తరం ఒకటి ప్రభుత్వానికి నిన్న వ్రాయుట మైతే

వ్రాశాను. కాని, తర్వాత పరిపరి ఆలోచనలతో రాత్రి నాకు నిద్రపట్టలేదు. చివరకు నాకు దారి కనిపించింది. మిమ్ములనిద్దరిని నా దగ్గర ఉంచమని నేను కోరలేదు. అట్లు కోరిన యెడ జైలెట్లవుతుంది? మనము వియోగమును సహింపవలసిందే. నీవు బుద్ధిమంతురాలివి. దుఃఖమును మరచిపో. ముందు ముందు నీవు గొప్ప కార్యములు చేయవలసి ఉంది. దుఃఖించుట మానవలసింది. సంతోషంతో ఉండు. బయటకుపోయి నేర్వ కలిగింది నేర్చుకో. నీవు చేసిన సేవ నీకు సర్వావస్థలలో కల్యాణప్రదమగుగాక! నీ చింత నా కెప్పుడు ఉంటుంది. నీవంటి దానవు నీవే. అమాయకురాలవు. సరళస్వభావవు. పరోపకారిణివి. సేవనే నీ ధర్మం గావించుకొన్నావు. కాని నీవిప్పటికిని చదువురానిదానివే. మూర్ఖురాలివి కూడా. చదువురానిదానవుగానే ఉంటే తర్వాత పశ్చాత్తాప పడవలసి వస్తుంది. జీవించి ఉంటే నేను కూడ అందుకు పశ్చాత్తాప పడవలసి ఉంటుంది. నీవు లేకపోతే నాకు బాగుండదు. కాని, నిన్ను నాదగ్గర ఉంచుకొనుటా బాగుండదు. దానిలో దోషముంది. అట్లుంచుకొనుటనే మోహమంటారు. నీవు రాజకోట పోవలెనని నా కిప్పుడనిపిస్తున్నది. అక్కడ నారాయణదాసు సత్సాంగత్యము నీకు లభించగలదు. (నారాయణదాసు గాంధి—రాజకోట రాష్ట్రీయశాల.)

అక్కడ నీవు పనికివచ్చే కళల నేర్చుకోగలవు. సంగీతమైతే తప్పకుండా నేర్వగలవు. నేర్వటానికి వీలైన మిగతా వాటి నన్నిటిని నేర్వవలసింది. కనీసం ఒక్క సంవత్సరమైన నీవు రాజకోటలో ఉంటే బుద్ధిమంతురాలివి కాగలవు. తర్వాత కరాచీ వెళ్లు. ఇంకెక్కడికైనా వెళ్లు. (కరాచీలో మా నాయనగారుండిరి. బాపు దగ్గరకు వచ్చేముందు నే నాయన వద్దనే ఉంటిని.) కరాచీలో గురుదయాల్ మల్లిక్ ఉన్నాడు. కాని ఆయనకూడ యిప్పుడక్కడ ఉండియుండడు. అందుచేత అక్కడ పట్టి చదువే—అదికూడ పనికివచ్చేదికాదు—నీకు లభించగలదు. ఎక్కువమంది ఆడపిల్లలతో కలిసి ఉండటం కూడా మంచిది. రాజకోటలో నీకు దొరికేది ఇంకెక్కడా దొరకదు. మౌన వ్రతం పూర్తి అయినతర్వాత యింకా చెప్పుతాను. నీ తల్లిని నేనేగదా? ఇంత అర్థం చేసుకో గలిగితే చాలు.

ఆగాఖాను మహాలు,<br>పూనా, 27-2-1944. } బాపు ఆశీస్సులు.

ఈ ఉత్తరాన్ని నీవు జాగ్రత్తగా ఉంచుకోవలసింది.

కాని నా సౌభాగ్యంవల్ల నేను 'బాపు' నుండి వేరు చేయబడలేదు. 'బాపు' తోనే నేనుకూడ ఆగాఖాను మహాలునుండి బయటకు వచ్చాను.

## ౨. 'బాపు' తల్లి అయినాడు

ఇక 'బా' పోయినరోజునుండి పధ్నాలుగు లేక పదిహేనేండ్ల తనబిడ్డను 'బాపు' తల్లిలాగ చూసుకొనుట మొదలుపెట్టినాడు. ఈ వయస్సుపిల్ల తన తల్లిదగ్గరనే ఉండ గోరుతుంది. ఒకవేళ అంతకుపూర్వంనుండి తల్లివద్దనే ఉండి యున్నచో ఈ వయస్సులో తల్లికి మరింత సన్నిహితురాలు కాగోరుతుంది. అందువల్ల 'బాపు' నన్ను తనదగ్గరనే ఉంచుకొన మొదలుపెట్టినాడు. నా స్నాన పానాదులు, వస్త్రధారణ, ఆహారవిహారములు, విద్యాభ్యాసం, ఆరోగ్యం, చివరకు ప్రతివారం నా తలంటు విషయం కూడ ఆయన శ్రద్ధ వహించటం మొదలుపెట్టినాడు. తుదివరకు శ్రద్ధతీసుకొంటూనే ఉన్నాడు.

'బాపు' నోఆఖాలీ వెళ్లినపుడు కాఠియవాడులోని 'మహువే' అన్నచోట నేను ఉన్నాను. ఆయనవద్ద ఉండ గోరుచున్నానని ఉత్తరం వ్రాశాను. తంతి (టెలిగ్రాము) పంపి నన్ను పిలిపించుకొన్నాడు. 'బాపు' దగ్గరకు వెళ్లినప్పుడు నేను చీరకట్టుకొని ఉంటిని. తలమీద ఏమీ లేకుండా తిరిగే అలవాటైతే నాకులేదు. కాని 'బాపు'ను చూచుట తోడనే నేను నమస్కరించగా నాతలమీది ముసుగు జారి

పోయింది. ఆసంగతి నాకుతట్టనేలేదు. నేను తల వంచగానే ఆయన నా చెవి పట్టుకొని—"ఏం—వచ్చావా" అని ప్రేమతో అన్నాడు. కాని, తర్వాత రాత్రి (19-12-'46 గురువారం, శ్రీరామపుర్) 'బాపు' నాతో—"గుజరాతీ పద్ధతిని చీరె కట్టుకొనుట మోటారులలో తిరుగునట్టి, తూగుటుయ్యేలలో ఊగునట్టి సేఠానీలకు (సేఠుల భార్యలకు) సరిపోతుంది. గుజరాతీ పద్ధతిని చీరకట్టుకొని నెత్తిమీద ముసుగు ఉంచుకొనకపోతే అది కండ్లతో చూడలేనంత అసహ్యంగా ఉంటుంది. నీవు గుజరాతీ పద్ధతిని చీర కట్టుకొనదలచుకొంటే 'బా' వలె, పాత పద్ధతినిపోయే తదితర గుజరాతీ స్త్రీలవలె కట్టుకొనవలసింది. వారి నెత్తిమీది ముసుగు ఎప్పుడూ జారిపోయేదికాదు. ఒకవేళ జారిపోయినా తత్క్షణం సర్దుకొనేవారు. అంత జాగ్రత్తగా నీవు ఉండాలి."—('బాపు' ఇంత చెప్పినప్పటికి ఆ విధంగా ఆయన ఎందుకు చెప్పుతున్నాడో నాకు తోచనే లేదు) అని, మరల చెప్పసాగినాడు "చీర కట్టుకొనుటలో 'బా' మొదలగు యితర స్త్రీలంత జాగ్రత్తగా నీవు ఉండజాలవని నే నెరుగుదును. అందుచేత నీకు ఇక్కడ ఉండాలని ఉంటే ఆగాఖాను మహాలులో ఉన్నట్లుగా పంజాబీ పద్ధతిని దుస్తులు ధరించవలసింది. ఆ వేషంలోకూడా తల మీద ఏమీ లేకుండా ఉండుట మంచిదైతేకాదు. కాని నీవంటి

పిల్లకు ఆ దుస్తులలో తలమీద ఏమీలేకుండా ఉండటం, గుజరాతీపద్ధతిని చీర కట్టుకొని ముసుగు లేకుండా ఉండుటంత వికారంగా ఉండదు. నేను నీకు తల్లిని అయినాను గదా ? అందుచేత అన్ని విషయాలు నీకు నేనే చెప్పవలసి ఉంటుంది. తల మీద ముసుగు లేకుండా ఎందుకు తిరుగుతావు ? ఈ కాలంలో జుట్టు పొడుగుగా ఉన్నా, పొట్టిగా ఉన్నా స్త్రీలందరూ కృత్రిమపు వెంట్రుకలుగల పొడుగుపాటి సవరాల పెట్టుకొంటున్నారు. మరి తలమీద ముసుగు ఉంటే అవి ఇతరులకు ఎట్లా కనబడగలవు ? సోదరీమణుల మధ్య ఉండే మనిషిని నేను. వారి పురోభివృద్ధికొరకు నేనుకూడ కొంతపాటుపడినాను. పార్శీ స్త్రీవలె కనబడవలెనని ఒకనాడు మేజోళ్లు, బూట్లు, పార్శీ స్త్రీలు కట్టుకొనేటువంటి చీరలు ధరించుట 'బా' కు నేర్పినవాడినే నేను. పాపం ! ఆవిడకు అటువంటి వంటే అభిలాషే లేదు. భగవంతుడిచ్చిన జుట్టును అట్లే ఉంచుకొనుటలోనే సౌందర్యముంది. కృత్రిమపు జుట్టులో లేదు. ఈ రోజులలో ఫూల్ దాన్ (ఫ్లవర్ వేస్) లో కూడ కాగితపు పువ్వులుంచుతున్నారు. ఆ కాగితపు పూలప్రక్క నిజమైన పువ్వుల ఉంచితే కన్నులకు నిజమైనవే బాగుంటాయి గదా ? (ఈ మాటమీదనుండే ఒక్కసారిగా 'బాపు' ఆధ్యాత్మిక విషయం ఎత్తుకొన్నాడు) సోదరీమణులు ఇంత

కృత్రిమ జీవితానికి అలవాటు పడినందువల్లనే వారు అత్యాచారములకు గురి అవుతున్నారు. ఈ విషయంలో నాకు ఎంతమాత్రం సందేహంలేదు. కృత్రిమములైన ముత్యాలు, వజ్రాలు, కొద్దికాలం ప్రకాశించి తర్వాత నల్లబడి పోగలవు. కృత్రిమపు వస్తువుల ధరించుట అలవాటగుటవల్ల వారి జీవితాలుకూడా కృత్రిమములై పోయినవి. బాహ్య వేషం కృత్రిమ మైనవారి హృదయం మంచిగా ఉండునని నే నెన్నటికిని అంగీకరింపజాలను. అందువల్లనే సోదరీమణులు నేడు అధః పతితలై పోవుచున్నారు. నాశనము చేయబడుచున్నారు. నేడు వారి చేతులకు ఆయుధాలిచ్చినను వారు దుండగీండ్రను ఎదుర్కొనజాలరు. అట్టిచో నిరాయుధులుగ నున్న వారు తమ్ము బలాత్కారం చేసేవారిని ఎట్లు ప్రతిఘటించ గల్గుదురు? సీత శరీర బలమెంత? ఆవిడవద్ద ఆయుధాలుకూడా లేవు. రావణునివంటి బలవంతుడు తలచుకొన్నచో ఆవిడను ఒక్క వ్రేలితో నలిపి వేసెడివాడు. కాని ఆవిడను తాకనైనా తాక లేకపోయాడు. దీనికి కారణం? ప్రబలమైన సీత పవిత్రతయే! అట్టి పవిత్రత నేడెక్కడుంది? బలాత్కారం చేస్తే నేడు ఏస్త్రీయైనా లొంగి పోతుంది. ఇక్కడ అట్టి సంగతులెన్నో జరిగినవి. 'లోబడక పోతే చంపివేస్తాము' అని దుండగీండ్రు అనగానే చాలామంది సోదరీమణులు చావునకు భయపడి లొంగిపోయారు. అందుచేత

రామాయణంలో వర్ణించబడిన సీతారాములు నిజంగా ఒకప్పు డున్నారా యని మనం సందేహించినప్పటికిని, వారిని కవి సృష్టిగా ఎంచినప్పటికిని ఆ సృష్టి ఎంత ఉదాత్తమైనదో చూడు! ఎంత భవ్యమైనదో చూడు! దానిని ఆచరణలో పెట్టవచ్చును. నిజంగా సీత పాత్ర సోదరీమణులంతా అర్థం చేసుకోవలసినటువంటిది." (కృత్రిమపు జుట్టు, నగలు, బట్టలు మున్నగువాటితో ప్రారంభించి 'బాపు' నన్ను ఎక్కడికి తీసుకొనిపోయాడు?) తిరిగి మొదలు పెట్టినాడు—"మరి గోళ్లకు, పెదవులకు రంగువేసుకొనే 'ఫేషన్' విషయం ఏమి చెప్పను?" నేను నవ్వి—"బాపూజీ! వాటి పేర్లను నేర్చు కొనమంటే నేర్చుకొనేదానిని. పెదవులకు రంగు వేసుకొనే దానిని 'లిప్‌స్టిక్' అంటారు. కాని గోళ్లకు వేసుకొనే దానిని ఏమంటారో నాకు తెలియదు," అని అన్నాను. అంత 'బాపు'—"అవును! అవును! పాపం! ఈ కాలపు సోదరీమణులు 'లిప్‌స్టిక్'తో పెదవులకు రంగు వేసుకుం టారు. గోళ్లకుకూడ రంగు వేసుకుంటారు. కాని, వారు ఎంత బలహీనులై పోతున్నారో, ఎంత పాలిపోతున్నారో చూసు కొనటానికి వారికి తీరుబడిలేదు. పాతకాలపు స్త్రీలలో ఎంత రక్తముండేది! వారి ముఖములు, గోళ్లు సహజంగానే ఎర్రగా ఉండేవి. మనం పాశ్చాత్యులను గ్రుడ్డిగా అనుకరిస్తున్నాము.

ఈ విషయంలో సోదరీమణులు సోదరులు కూడ దోషులే. కాని స్త్రీలను మాత్రం క్షమించటానికి వీలులేదు. పాశ్చాత్యులనుండి క్రమశిక్షణ, సభ్యత, మర్యాద, వినయము, నియమితత్వము (నిగ్రహము), కార్యోత్సాహము, కార్యతత్పరత, క్రొత్త విషయముల నేర్చుకొనుటయందాసక్తి, కలుపుగోలు తనము, మున్నగు విషయాలు నేర్చుకోవలసినవి ఎన్ని ఉన్నాయి! కాని మనమైతే వాటినన్నిటిని వదలివేసి 'పవుడర్' వేసుకొనే ఫేషన్ తీసుకొన్నాము! అందుకనే భారత దేశానికి స్వరాజ్యం, సురాజ్యం సోదరీమణులే తీసుకొని రాగలరని నేను నెత్తిని నోరుపెట్టుకొని అరచి చెప్తూ తున్నాను. గృహిణిలేనిదే గృహవ్యవస్థ ఎట్లు పూర్తికాదో అట్లే సోదరీమణులు పాల్గొననిదే దేశవ్యవస్థకూడ పూర్తికాజాలదని నా నమ్మకము. సోదరీమణులు పవిత్రురాండ్రయినప్పుడే అది సంపూర్తి అవుతుంది. పవిత్ర శబ్దానికి నా అర్థం ఏమిటో నీవు తెలిసికొనగలవా? తన్ను పవిత్రురాలుగ చెప్పుకొనే ఆమెయందు అన్ని గుణాలు ఉండాలి. ఆ గుణాలన్నిటి వర్ణన 'పవిత్ర' శబ్దములో ఉన్న మూడు అక్షరములలో ఇమిడి ఉంది. మనలో వివేకముంటేనే మనకు పవిత్రత రాగలదు. ఘోషా పద్ధతికి నేను విరోధినే. కాని మర్యాద మాత్ర ముండవలసిందే. బాహ్యాంతరములలో స్వచ్ఛత ఉంటేనే

పవిత్రత ఉంటుంది. మంచి పనితనమున్నప్పుడే పవిత్రత లభించగలదు. సత్యనిరతి ఉన్నప్పుడే పవిత్రత రాగలదు. దంభము, ఆడంబరము, నటన లేకుండినప్పుడే పవిత్రత పొడసూపగలదు. ఆత్మగౌరవ మున్నప్పుడే, సేవాసక్తి ఉన్నప్పుడే పవిత్రత లభించగలుగుతుంది. పవిత్ర శబ్దానికి ఇట్టి అర్థాలు ఎన్నో ఉన్నవి. ఎక్కడ పవిత్రత ఉందో అక్కడ ఈశ్వర సాక్షాత్కారము కలుగుతుందన్న మాటకుకూడ ఎట్టి సందేహం లేదు. సోదరీమణులవద్ద ఈ ఒక్క అస్త్రం ఉంటే చాలు. ఖడ్గంతో పని ఉండదు. ఈటెలు, బల్లెములు అవసరం ఉండవు. కాని లోహంతో చేయబడిన ఆయుధాలను ఉప యోగించుట నేర్చుకొనటంకంటె పవిత్రత సంపాదించటం చాల కఠినమైన పని. సరిగా అర్థం చేసుకోగలిగితే చాల సులభమైన పనికూడ.

“ చీరకట్టుకొనే విషయం తీసికొని నేను నీకెంత గొప్ప పాఠం నేర్పినానో చూడు! నీకు తల్లిని అయినానుగదా నేను ? నీ తండ్రిగాని, తాతగాని నీకు గురువులైనప్పటికిని తల్లి బాధ్యత నామీదనే ఉంది. బాధ్యత వహించినప్పుడు సరిగా నెరవేర్చ వలసే ఉంటుంది. ఈ వేళ నేను నేర్పిన పాఠం నీవు నీ జీవితంలో అలవరచుకోవలసింది. కాని దానికిముందు నేను చెప్పింది రేపు నీ ‘ డైరీ ’ (దినచర్య వ్రాసే పుస్తకం) లో

వ్రాసి నాకు చూపించవలసింది. నేనుచెప్పింది నీ వెంత జీర్ణం చేసికొన్నావో దానినుండి నేను గ్రహించగలను. (ఆరోజు లలో నేను ప్రతిదినం డైరీ వ్రాసేదానిని. 'బాపు' దానిని ప్రతిరోజు చూసి సంతకం చేసేవాడు.)

'బాపు' నన్ను నిద్రలేపినప్పుడు రాత్రి పన్నెండున్నర గంటలైంది. అప్పటినుండి 'బాపు' నాకు చెప్పుట పూర్తి అగునప్పటికి ఒంటిగంట పదిహేను నిమిషాలైంది. అందుకని ఆయన— "ఇక ఇప్పుడు నీవు నిద్రపో. నాకు నిద్రరాలేదు. అందుకని నిన్ను నిద్రలేపినాను. ఈ పిల్ల బాధ్యత తీసికొని సంకటస్థితిలో చిక్కుకొన్నానని నాకనిపించి నిన్ను నిద్ర లేపినాను. ఇక నిద్రపో," అని అన్నాడు.

ఈ నాతల్లి అట్టిది! అర్ధరాత్రి నిద్రలేపి బుద్ధులు చెప్పుచుండేది నాకు!

ఈశ్వరుడు నానుండి ఈనాడు నా ముగ్గురతల్లుల తీసికొని పోయినాడు! బోటాదకర్ అనే ఒక గుజరాతీ కవి తల్లి నీవిధంగా కీర్తించినాడు.

కడుపవిత్రమైన గంగనీరైనను,
హెచ్చుచుండు, తగ్గి వచ్చుచుండు,
తల్లిప్రేమ యెపుడు తరుగదు, విరుగదు,
తల్లిసాటి యొండు ధరణి గలదె?

నిజంగా పైపద్య పంక్తులు నాకు పూర్తిగా అనుభవానికి వచ్చినవి. నా ముగ్గురతల్లుల ప్రేమకూడ వారివారి జీవితాలలోని ఆఖరి ఘడియల వరకు ఎంతమాత్రం తగ్గలేదు!

## ౩. గీతాగురువు

నోఆఖాలీలో అంత పనిలో ఉండికూడ 'బాపు' ప్రతిదినం నాకు గీత చెప్పుటకు కనీసం పదినిమిషాలైనా తీరుబడి చేసుకొనేవాడు.

ఆగాఖాను మహాలులో 'బాపు'నుండి అంకగణితం, బీజగణితం, భూమితి, భూగోళం, ఇతిహాసం, విజ్ఞానశాస్త్రం, సంస్కృతం మున్నగునవి నేర్చుకొనే సౌభాగ్యం నాకు గల్గింది. కాని ఆయన స్వయంగా నాకెప్పుడు ఇంగ్లీషుమాత్రం చెప్పలేదు. దానిని ఇతరులు చెప్పేవారు. పూజ్యురాలగు కస్తూరిబా జబ్బుమూలాన, తగినంత తీరుబడి లేనందువల్ల పై విషయాలు నాకు బోధించటం ఒకదానితర్వాత ఇంకొకటి 'బాపు' మానివేయవలసివచ్చింది. కాని తుదివరకు కూడ సంస్కృతం చెప్పటం మాత్రం ఆయన వదలలేదు. అంటే నా జీవితంలో నాకు గీతను బోధించుట 'బాపు' యే మొదలుపెట్టినాడు. ఇతరవిషయాలను ప్యారీలాల్‌గారు, సుశీలాబహన్, డాక్టర్ గిల్డరు మున్నగు తదితరులు—బాపు

వద్ద నాతోపాటు ఉండే సోదర సోదరీమణులు—చెప్పసాగిరి. కాని "మనూకు గీతను నేనే బోధిస్తాను" అని ఆఖరి వరకు 'బాపు'యే నాకు గీతను చెప్పెడివాడు. బడిలో చదువుతున్నప్పుడు, తర్వాతకూడ ఇతరవిషయముల బోధించుటకు నాకనేకమంది గురువులైనారు. కాని, నాకు గీతాగురువు 'బాపు' ఒక్కడేనని గట్టిగాచెప్పగలను. ఆ విషయంలో కూడ నే నితరులనుండి కొద్దో, గొప్పో సహాయం తీసికొని ఉండవచ్చును.

ఆగాఖాను మహాలులో గీతా శ్లోకములలోని శబ్దముల సరిగా ఉచ్చరించుటకు మాత్రమే నేర్చుకొన్నాను. నేను నోఆఖాలీ చేరినతర్వాత 'బాపు' నన్ను ఒక్కరోజే సెలవు తీసికొన నిచ్చినాడు. రెండవరోజున—"నీవు నాదగ్గరకువచ్చి ఇరవైనాలుగు గంటలైంది. అంటే పాత కాపువై పోయావన్న మాట. సరే నీ గీతాభ్యాసం ఎంతవరకు వచ్చిందో చెప్పు. ఇక్కడ నీవు నాపని చేయటమే కాక చదువుకొనవలసి ఉంటుందికూడ," అని అన్నాడు. అప్పుడు నేను—"జైలు నుండి విడుదల అయిన తర్వాత గీతను నాఅంతట నేనే అప్పుడప్పుడు చదువుకొనే దానిని. కాని ఉచ్చారణ బాగు చేసుకొనేందుకు గాని, గీతార్థమును తెలిసికొనేందుకు గాని ఎవ్వరిని గురువుగా చేసికోలేదు. ఎందుకంటె ఇతరవిషయాల నేర్పుటకు

గురువులు ఏవ్వరైనా, ఎంత మందైనా నా కభ్యంతరం లేదు. కాని గీతా గురువుగా మీరుతప్ప ఇంకెవ్వరు నాకుండరాదని నా కోరిక. అందుకని నాఅంతట నేనే వచ్చిరానట్టి ఉచ్చారణతో శ్లోకాల చదువుతూ తెలిసినంతవరకు అర్థం గ్రహించుతూ పోయానుగాని ఇతరుల సహాయంతో ముందుకుసాగి పోవటానికి ప్రయత్నించలేదు," అని జవాబు చెప్పినాను. దానికి 'బాపు' దుఃఖితుడై—"నీ ఈ ఇచ్ఛలో అర్థంలేని మోహముంది. మంచివిషయం నేర్చుకొనుటకు వేలకొలదియే కాదు లక్షలాది గురువు లెందుకుండగూడదు? ఉండిన నష్టమేముంది? చిన్న పిల్లవాడినుండికూడ మనమెందుకు నేర్చుకోరాదు? మంచిది నేర్చుకొనుటలో సిగ్గెందుకు? 'మేలుకొన్నప్పుడే తెల్లవారిందనుకొను' మన్న సామెత ప్రకారం నేటినుండి గీతాపఠనం మొదలుపెట్టు. ఉచ్చారణ విషయంలో శ్రమపడ వలసినదంతలేదు. నీకింత వరకు గీతార్థమును బోధించనందులకు నాకు కష్టముగా ఉంది. ఇక నీవు ప్రతిరోజూ అయిదు గీతాశ్లోకములు వ్రాయవలసి ఉంటుంది. (నేను ప్రతిదినం శ్లోకములు వ్రాసేదానిని. ఎంతపనిలోఉన్నా పరే 'బాపు' వాటినిచూసి, తప్పులుదిద్ది, సంతకము చేసేవాడు) నీవు వ్రాసే శ్లోకములకు పదచ్ఛేదము, అర్థము వేరువేరుగా వ్రాయవలెను. గీతలోని మూడవ అధ్యాయము

యజ్ఞమునుగురించి. గీతాభ్యాసముకూడ ఒక యజ్ఞమే. కాని యజ్ఞమనగా ఏమిటో నీకు కొంచెము చెప్పుతాను, " అని ఈ విధంగా చెప్పినాడు ' బాపు '—

" యజ్ఞము చేయకుండా తిండి తినేవాడు దొంగసొమ్ము తింటున్నాడని భగవానుడు చెప్పుచున్నాడు. ఇది చాల మహాత్వముగల విషయము. దొంగ సొమ్ము పాదరసము వంటిది. శుద్ధి చేయని పాదరసము జీర్ణముకాదు. ఎవరైనాసరే అట్టి పాదరసము తిన్నచో అది ఆ తిన్నవారి ప్రత్యంగము నుండి బయటకు వస్తుంది. దొంగ సొమ్ము తింటే కూడ అదేగతి పట్టుతుంది. మనుష్యుడు యజ్ఞం చేయకుండా ఒక్క నిమిష మున్నను వాడు దొంగని స్పష్టమవుతుంది. యజ్ఞం మనమం దరం కూడా చేయవలసిందే. సౌభాగ్యంవల్ల హృదయం సరిగా ఉన్నవాడికి యజ్ఞం చేయటం సులువైన పని. అతనికి ధనమవసరం లేదు. బుద్ధి అవసరం లేదు. చదువు అవసరం లేదు. యజ్ఞ మంటే పరోపకారం. ఎవని యావజ్జీవితం యజ్ఞంతో నిండి ఉంటుందో అట్టివాడు దొంగ సొమ్ము తినటం లేదని చెప్పవచ్చు. కొద్దికొద్దిగా యజ్ఞం చేసేవాడు దొంగతనం కొంచం తక్కువగా చేసేవాడన వచ్చును. ఈ దృష్టితో చూస్తే మనమంతా కొద్దిగనో గొప్పగనో దొంగతనం చేస్తూనే ఉన్నాము. స్వార్థం పూర్తిగావదలి

నప్పుడే పూర్ణ యజ్ఞం అయిందని చెప్పవచ్చు. స్వార్థం వదలుట అనగా—'నేను, నాది' అన్నదానిని వదలుటన్నమాట. 'ఇతడు నా సోదరుడు—వాడు పరాయివాడు, ఇది నా సోదరి, ఆమె పరాయిది' ఇట్టి భావము హృదయంలో ఉండనేరాదు. తన సర్వస్వం భగవంతునికి అర్పణ చేయగల్గినవాడే అట్లు చేయగలడు. సేవచేసేవాడు భగవంతుని మధ్య పెట్టుకొని అతని సేవకుడుగనే అన్ని పనులు చేయును. సేవాభావము తోనే అతను అంతాచేయును. అట్టి మనిషి సర్వదా సుఖగా ఉండును. ఎప్పుడు శాంతుడుగానే ఉండును. అతనికి సుఖదుఃఖములు రెండును సమానములు. అతడు తన శరీర మును, మనస్సును, బుద్ధిని—తనదగ్గర ఉన్నదానినంతా పరమార్థముకొరకే వినియోగించును. నిజమైన అట్టి యజ్ఞం మనమంతా చేయలేము. లోకానికంతకూ సేవ చేయాలన్న భావం మనకున్నచో అప్పుడు లోకానికంతకు సేవగా పెక్కు-మంది చేయగల్గిన పని ఏదన్న ప్రశ్నపుట్టును. దానికి జవాబు ఆలోచించితే—లోక శ్రేయస్కరమైంది, అందరు చేయగలి గింది, పనులలో ముఖ్యమైంది నూలు వడకుటయే అని తేలును. పరమార్థ దృష్టితో అసంఖ్యాకులు ఈ పనిని చేయగలుగుదురు. అందుకని ఈ శ్రమ లోకకల్యాణము కొరకు చేయబడిందని, దాని వల్ల అనేకమంది బీదవారలకు

తిండి దొరకుతుందని చెప్పవచ్చును. గ్రుడ్డివాళ్లుకూడ ఈ పనిని చేయవచ్చును. ప్రతిబారతో పాటు రామనామం కూడ జోడింప వచ్చును.

"నీకు గీతార్థమును ఈ రీతిగా నేను బోధించకోర్తాను. వ్యాకరణ దృష్టితో నేకాదు. ఇది ఒక ఉదాహరణగా ఇచ్చాను. యజ్ఞం యొక్క సరియైన అర్థం చెప్పినాను. యజ్ఞమే నూలు వడకుట—నూలువడకుటయే యజ్ఞం."

## ౪. నిజమైన విద్య ఏది?

క్రిందటి ప్రకరణంలో తెలిపిన పద్ధతిని పూజ్యుడగు 'బాపు' నాకు చదువు చెప్పుచుండేవాడు. అయినప్పటికిని అప్పుడప్పుడు నేను—"మీరు నాచదువు చెడగొట్టినారు. (చదువుకొంటున్న నన్ను కరాచీనుండి 'బాపు' తన దగ్గరకు పిలిపించుకొన్నాడు) నేను పరీక్షలకు కూర్చొని ఉండ వలసింది" అని అనేదానిని. ఈ నాటి నా సోదరీమణులవలె ఆ రోజులలో నాకుకూడ 'డిగ్రీ'లన్న మోహముండేది. ఈశ్వరునకు నాయందు దయపుట్టి నన్నా మోహామునుండి బయట పడవేశాడు. నా పరమగురువు నాకు నేర్పిన పాఠం బి.ఎ., ఎం.ఎ., లేక లండనులో దొరకు పెద్ద పెద్ద డిగ్రీల వల్ల కూడ లభించదని, దానివల్ల నా జన్మసాఫల్యమైనదని

నే నిప్పుడు చెప్పినచో ఎవ్వరు నన్ను వివేకినిగా తలంపకుందురు గాక! నాకట్టి ఉత్కృష్టమైన అవకాశం దొరికింది. కాని నాకీ బుద్ధి ఈనాడు వచ్చింది. ఆ నాడు నేను 'బాపు'తో పదే పదే "మీరు నన్ను బడిలో చదువుకో నియ్యలేదు" అని అనుచుండేదానను. దానికి జవాబుగా 'బాపు'— "నాకైతే నీకు విద్యా బుద్ధులు రెండూ చెప్పవలసి ఉంది. నిన్ను బడి చదువులో వదలితే అదెట్లు కుదిరేది?" అని అనే వాడు. నేను ప్రత్యుత్తరంగా— "మహాదేవు కాకా (మహా దేవు దేశాయి) ఇంత చదివిన వాడగుట వల్లనే మీకు కార్యదర్శి కాగలిగినాడు. డిగ్రీల సంపాదించుట వల్లనేగదా ఆయన ముందుకు రాగలిగింది? గొప్పవాడైంది," అని అనేదానను. 'బాపు' నవ్వి— "ఎంతగొప్పో అంత బూటకము! ఇకముందు నీవు 'డిగ్రీ'కి బదులు 'ఉపాధి' శబ్దమును ఉపయోగించు. ఉపాధి ముమ్మాటికిని ఉపాధియే (చింత, కపటము). బారిష్టరు అయినందుకు ఈ నాటికి కూడ నేను పశ్చాత్తాప పడు తుంటాను. నిజం అడిగితే నేను 'బారిష్టరు' నన్నమాట నాకు తలంపునకైనా రాదు. అందుకని, నేను, నా అనుభవం మీద ఆధారపడే ఇతరులను ఉపాధులనుండి రక్షించటానికి ప్రయత్నిస్తున్నాను. భాషలెన్నియైనా నేర్వవలసిందే. కాని ఈ నాటి విశ్వవిద్యాలయాలలోని విద్యార్థులు గ్రుడ్డిగా

వల్లెవేయటం, పట్టి డిగ్రీలకొరకు ఆరోగ్యాన్ని నాశనం చేసి కొనటం నాకు బాధ కలిగిస్తుంది. మనకిప్పుడవసరం నిర్మాణ కార్యక్రమం. గ్రామాలలో ఎంతో పని పడివుంది. చదువు లలో విద్యార్థులు ఎంత కాలం గడపుతున్నారో అంతకాలం నిర్మాణ కార్యక్రమానికి ఇస్తే దేశం యొక్క రూపురేఖలే మారి పోగలవు. జ్ఞానంకొరకు చదువైతే— అది వేరు మాట. అప్పుడు— జ్ఞానంకొరకు చదువు— చదువుకొనుటకు జ్ఞానం అన్నది మంత్రం కాగలదు. కాని నేను, పరీక్ష కొరకు చదువు-చదువుకొరకు పరీక్ష అన్నదే నలువైపుల కన్పట్టు చున్నది. దాని తర్వాత ఆ జ్ఞానం డబ్బు సంపాదన కొరకు ఉపయోగించబడుతున్నది. కొందరు డాక్టరులు అవుతున్నారు. కొందరు వకీళ్లు, మరికొందరు ఇంజనీర్లు. పరీక్షగుటతోడనే నౌకరీకోసం వెతుకులాట మొదలు. నౌకరీ అంటే కష్టపడి పనిచేసి చేసి చావవలసిందే. జీతం కడుపుకైనా సరిపోదు! పరిశీలించి చూస్తే మన చదువులకంతా ధ్యేయం ఒక్కటే. మంచి నౌకరీ ఎట్లు దొరకుతుందా అని. ఇది అందరి పట్ల సరికాక పోవచ్చు. నలుబది కోట్ల ప్రజలలో అందరూ ఇదే చేస్తున్నారనికాదు, నేను చెప్పేదానికర్థం. కాని, నేటి చదువులకు లక్ష్యం మాత్రం ముమ్మాటికిదే. కాలేజీ చదువు తర్వాతనే సేవ చేయగలమనుకొనటం మాత్రం

వట్టి భ్రమ. మనిషి ఏ స్థితిలోనైనా సేవ చేయగలడు. ఇతరుల సేవ చేయకుండా ఏ ఉపాయం చేతనైనా తప్పించుకొనుటకు వీలులేనన్ని శక్తులను ఈశ్వరుడు మనిషి కిచ్చినాడు. అట్లు గాకున్నచో మనిషి ఎంత భయంకరుడు! అప్పటికిని ఉన్న పని తప్పించుకొనుటకు ఏదో ఒక వంక వెతుకుకోగలడు. ఒకడు తన ధనంతో సేవ చేస్తే, ఆరోగ్య వంతుడైన ఇంకొకడు తన శరీరంతోను, మరొకడు తన బుద్ధి తోను సేవచేస్తూ ఉంటాడు. కన్ను, కాలు, నోరు, చెవి ఒకటేల అన్ని అంగములు సేవకు ఉపయోగించుతాయి. దీనినైతే నేనొక ఉదాహరణగా ఇచ్చాను. అందుచేత మన దగ్గర ఉన్న శక్తుల నన్నింటిని భగవానున కర్పించ వలసిందే. అప్పుడే మనకు పూర్తి 'మార్కులు' దొరకగలవు. కోటి రూపా యలు ఇచ్చుటకు శక్తిగలవాడు, కోటిలో సగమేయిస్తే అతనికి నూటికి 50 మార్కులే దొరుకును. కాని ఒక్కపైస ఇచ్చుటకు శక్తిగలవాడు ఆ ఒక్క పైసను ఇస్తే అతనికి నూటికి నూరు మార్కులు లభించుతాయి.

"వ్యవహారం శుద్ధంగా ఉండాలి. స్వార్థంతోగాని, భయంతోగాని ఒకడు చేసేది సేవ అనబడజాలదు. భగవ దార్పణముగా చేసే చోట స్వార్థం ఉండనే ఉండజాలదు. సేవచేసేవాడు ఈ విధంగా ప్రతి దినం తన శక్తిని వృద్ధి చేసుకుం

టాడు. అతను చేసే ప్రయత్నాలను కూడ సేవాభావంతోనే చేస్తాడు. ఇట్లు సేవాపరాయణుడైనవాడి మాటలో, నవ్వులో, ఆటలో, పాటలో, తినుటలో, త్రాగుటలో—ప్రతిపనిలో సేవాభావమే ఉంటుంది. అంటే అతని పనులన్నీ నిర్దోషం గానే ఉండగలవన్నమాట. అట్టి భక్తులకు ఈశ్వరుడు అవసరమైన శక్తులన్నీ ప్రసాదించుతాడు. ఈ క్రింది శ్లోకములా విషయం తెల్పుచున్నాయి.

" అనన్యాశ్చిన్తయన్తో మామ్ జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥
మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥
తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥ "

అర్థం :—ఎవరు అనన్య భావంతో నాచింతన చేయుచు నన్ను భజింతురో, నిత్యం నాయందే రతులైయుం దురో అట్టివారి యోగక్షేమాల భారము నేను వహింతును. (దీని భావం-ఫలమునందాశవీడి భగవంతుని పనిచేయమని) నాయందు చిత్తము లీన మొనర్చువారు, నాయందే ప్రాణము గలవారు—ఒండొరులకు బోధించుకొనుచు, భజన చేయుచు సంతోషంతోను, ఆనందంతోను ఉందురు. ఈ విధంగా

నాయందే రమించువారికి, నన్ను ప్రేమతో భజించు వారికి నేను జ్ఞానమొసంగుదును. దాని వల్ల నన్నువారు పొందుదురు.

"ఈ శ్లోకముల విషయం కొంచమాలోచించు. అందులో ఆఖరి శ్లోకం చాల మహాత్వం కలది. దానిని తెలిసి కొనుటకు పూర్ణ శ్రద్ధా భక్తులు అవసరం. నేను నీ మనస్సునకు పట్టేటట్లు చెప్పదలచుకొన్న దేమంటే భగవత్కార్యములు చేయుటలో డిగ్రీలు ఏమీ ఉపయోగపడవన్న సంగతే. బహుశ కాలేజీలలో చేరుటకు వలయు చదువు నీవు చదివి ఉంటే ఇప్పుడు ఎక్కడ ఉండేదానివి? నావశమైతే నేటి కాలేజీ విద్యార్థులను విద్యార్థినిలను దేశంలో రేగిన ఈ విద్వేషాగ్నిని ఆర్పుటలో వినియోగిస్తాను. నిజంగా మన విద్యార్థుల హృదయాలనుండి డిగ్రీల మోహమే పోతే— ప్రపంచ చిత్రపటములో ఒక చుక్కగా ఉన్న భారతదేశం మహాసాగరమంత పెద్దది, ప్రాముఖ్యతగలది అగుట చూడ గలవు. 'దుప్పటి పొడుగు చూసుకొని కాళ్లు సాచు'మని ఒక లోకోక్తి ఉంది. దాని అర్థం నీ శక్తికొలది పనిచేయ మని. సుందరమైన ఈ లోకోక్తి కుటుంబానికేకాదు వర్తించేది, దేశాలకుకూడ వర్తిస్తుంది. దేశస్థితికి అనుగుణంగానే ప్రజల ఆచారవ్యవహారాలు, కార్యకలాపాలు ఉండాలి.

గ్రుడ్డివాళ్లవలె మనం ఇంగ్లీషు వారిని అనుకరించితే అధఃపతితులమై పోతాము. హంస కాకివలె పోయిఉంటే చచ్చిపోయి ఉండేదికదా! దానికి సహజమైన గతిని పోవుటవల్లనే అది జయించింది. ఈ కథ నీకు తెలుసునుకదా? కథలు ఊరకే ప్రొద్దుపుచ్చటానికి కాదు. అమూల్యమైన ఉపదేశాలతో అవి నిండి ఉంటాయి. భారతదేశంలో అనేక చెడు ఆచారాలు ఉన్నాయి. అయినప్పటికిని అది తన పద్దతినే నడుస్తే కల్పనాతీతమైన ఉచ్ఛస్థానాన్ని పొందగలుగుతుంది. ఏలనన భారతీయ సంస్కృతి ఈడులేనిది. గీతను నీకు నేను బోధిస్తుంటే దాని నుండి క్రొత్త క్రొత్త అర్థాలు బయల్వెడలుచుండ గలవు. కాని నేటికి నీవు ఈ మాత్రం జీర్ణం చేసికోగలిగితే చాలు. నేను చెప్పినదంతా వ్రాసుకో. వ్రాయటం వట్టి వ్రాయటమే కాగూడదు. గీతార్థం ఆచరణలో పెట్టటానికే. నేడు చెప్పిన పాఠానికంతా గీతయే ఆధారం."

నా చదువు చెడగొట్టినాడని 'బాపు'ను నేను నిందించుటవల్ల నాకీ ఉపదేశమంతా చేయబడింది. ఆ అమూల్యోపదేశంయొక్క ఋణమును నేను ఈనాడు తీర్చుకోలేను. ఇతరుల కోపాగ్నిని, విమర్శనలను, దోషారోపణలను, దయాళుడగు 'బాపు' మధువుగ్రోలినట్లు గ్రోలుచుండెడివాడు. ఆయనముందర ఇష్టము వచ్చినట్లనటానికి

మాకు స్వాతంత్ర్యముండేది. అయినప్పటికిని చిన్నతనంవల్ల అట్లని ఎంత అవివేకమైన పని చేశానో ఇప్పుడు నాకు తెలుస్తున్నది. నేనెంత నిర్భాగ్యురాలను! కాని పుత్రుడు కుపుత్రుడైనప్పటికిని తల్లిమాత్రం కుమాత కాజాలదు గదా ?

అద్భుతమైన ఈ పాఠమును నాకు చెప్పుటలో ఆయన ఉద్దేశమేమో ఈశ్వరునికే తెలియాలి. ఆయన పనులనుండీ కూడ నన్ను వదల్చి నాచేత డైరీ తప్పకుండా వ్రాయించేవాడు. 'సంవత్సరం తర్వాత నేను పోదును' అన్న భావం ఆయన మనస్సులో లేదుగదా ? తప్పకుండా ఆయనకట్టి ముందు చూపు ఉండి ఉండవలెను. అందుకనే ఈ డైరీ నాపట్ల 'బాపు' మరణ శాసనమైంది.

## ౫. రైలు పెట్టెలో రెండు అరలు తీసికొనుట

పూజ్యుడగు 'బాపు' 1947వ సంవత్సరం, మార్చి 30 తేదీన లార్డ్ మౌంట్ బ్యాటన్‌ను మొట్టమొదటిసారి కలిసికొనటానికి వెళ్లబోవుచుండెను. నోఆఖాలీ, బీహారులలో శాంతిని చేకూర్చుటనే మహాయజ్ఞం ప్రారంభించిన తర్వాత ఇది మొదటి ప్రయాణము. విమానంమీద ఢిల్లీకి రావలసిందని రాజప్రతినిధి 'బాపు'నకు సూచించాడు. కాని 'బాపు'—

"కోట్లకొలది ప్రజలు ప్రయాణం చేయజాలని వాహనంలో నేనెట్లు పోగలను" అని విమానంలో పోవుటకు నిరాకరించాడు. "నా పనికి రైలు చాలు"నని దానిమీదనే పోవుటకు నిశ్చయించుకొన్నాడు.

ఎండ తీవ్రంగా ఉండింది. దాన్ని భరించటం చాలా కష్టంగా ఉండింది. ఇరువదినాలుగు గంటల ప్రయాణం. దానికి తోడు ప్రతిస్టేషన్‌లో రాష్ట్రముయొక్క పరమపితను దర్శనం చేసికొనుటకు వేలకొలది ప్రజలు గుమిగూడెడివారు. కాని 'బాపు'నకు ఇవి ఒక కష్టాలా? ఆయనకు వాటి ఆలోచనయే లేదు. ఆయన నన్ను పిలిచి చెప్పసాగినాడు— "చూడు! ఈ యజ్ఞంలో నీ వొక్కదానివే నావెంట ఉన్నావు. యజ్ఞంలో దిగినతర్వాత ఢిల్లీకి నేను మొట్టమొదటిసారి వెళ్లుచున్నాను. నోఆఖాలీ వెళ్లేటప్పుడు—అక్కడ 'నా విధిని నెరవేర్చనైనా నెరవేర్చాలి లేకపోతే మరణించనైనా మరణించాలి' అని నిశ్చయించుకున్నాను. అందుకనే నా సహచరుల నందరిని వేరువేరుగా పంపివేశాను. నిన్ను ఒక్కదాన్నే నా యజ్ఞంలో పాల్గొన నిచ్చాను. నోఆఖాలీకి వచ్చే ముందు అందరిని వదలి ఎట్లా వచ్చానో అట్లే దేవప్రకాశ్, హునర్, (ఒక ముసల్మాను సోదరుడు) మృదులాబహన్ మున్నగు తక్కినవారిని ఇక్కడనే వదలిపోవుచున్నాను.

మృదులాబహాన్ ఇక్కడ నాతరఫున పని చూడగలదు. కాని నిన్ను నేను వదలుటకు వీలులేదు. నేను నిన్ను వదలిపోవుట నీకు ఇష్టంగాకూడ ఉండదు. అందుకని నీవు నావెంట రావలసింది. వీలైనంత తక్కువ సామాను తీసికో. మూడవ తరగతి రైలు పెట్టెలలో ఎంత చిన్నది దొరికితే అంత చిన్నది తీసికోవలసింది. కాని జాగ్రత్త. ఇది నీకు అగ్ని పరీక్షున్న సంగతి జ్ఞాపకముంచుకో."

సామానైతే నేను తక్కువలో తక్కువగా తీసికొన్నాను. రైలు పెట్టెను ఎన్నుకొనేటప్పుడు—"ప్రతి స్టేషన్‌లో దర్శనార్థం వచ్చే జన సమూహాంవల్ల 'బాపు' నకు ఒక్క ఘడియ కాలమైనా విశ్రాంతి ఉండదు. హరిజన నిధికొరకు 'బాపు' చందాలు అడుగును. వచ్చే డబ్బును నేను లెక్కపెట్టవలసి ఉంటుంది," అని ఆలోచించి రెండు అరలున్న ఒక పెట్టెను తీసికొన్నాను. ఒక అరలో సామాను పెట్టినాను. రెండవదానిలో 'బాపు' కూర్చొనటానికి, పడుకొనటానికి ఏర్పాట్లుచేశాను.

ఢిల్లీపోయే రైలుబండి పాట్నానుండి ఉదయం తొమ్మిదిన్నరగంటలకు బయలుదేరుతుండేది. 'బాపు', నేనూ తొమ్మిదిగంటల ఇరువదిఅయిదు నిమిషాలకు స్టేషన్ చేరినాము. అక్కడ జనసమ్మర్దం ఎక్కువగా ఉంది. అయినప్పటికి మేము

రైలు ఎక్కినాము. 'బాపు' అయితే ప్రతి నిమిషాన్ని సదుపయోగం చేసే మనిషి. అయిదు నిమిషాలలో ఆయన హరిజన నిధికి చందాలు వసూలు చేశాడు. సరిగా తొమ్మి దిన్నరకు బండి బయలుదేరింది.

వేసవికాలంలో 'బాపు' పదిగంటలకు భోజనం చేసే వాడు. అన్నీ సిద్ధం చేయటానికి పెట్టెయొక్క రెండవ అర లోనికి నేను వెళ్లాను. కొంతసేపు అయిన తర్వాత 'బాపు' దగ్గరకు వచ్చాను. 'బాపు' ఏదో వ్రాసుకుంటూ ఉండి నన్ను—"ఎక్కడికి వెళ్లావు" అని అడిగినాడు. "ఇక్కడే భోజనం సిద్ధం చేస్తున్నాను" అని అన్నాను. అప్పు డాయన కిటికీనుండి బయటకుచూస్తూ నన్నుకూడ చూడ మన్నాడు. నావల్ల ఏదో ఒక తప్పు అయిందని నా కనిపించ సాగింది. నేను బైటకుచూస్తే రైలుపెట్టెల కమ్ములు పట్టుకొని వ్రేళ్లాడుతున్న మనుష్యులెంతమందో కనబడినారు. మృదు వుగా నన్ను మందలించుతూ బాపు—"ఈ రెండవ అర కావాలని నీవడిగినావా? అని నన్ను ప్రశ్నించాడు. "అవును. ఇదే అరలో నేను పనిచేస్తూ ఉంటే, గిన్నెలు తోమితే, స్టవుమీద పాలుకాస్తే మీకు కష్టమవుతుందని తలంచి రెండు అరలున్న పెట్టెను తీసుకొన్నాను," అని జవాబిచ్చాను.

'బాపు' అన సాగినాడు—"ఎంత పటుత్వంలేని వాదన! దీనినే గ్రుడ్డిప్రేమ అంటారు. నాకు కష్టంలేకుండా ఉండటానికి నన్ను విమానం ఉపయోగించమంటే నేను నిరాకరించినతర్వాత, ప్రత్యేక రైలుద్వారా రమ్మని నాకు చేయుబడిన సూచన సంగతి నీవు ఎరుగుదువు. ఒక ప్రత్యేక రైలు (స్పెషల్ ట్రైన్) నడవాలంటే ఎన్ని బండ్లు ఆగవలసి వస్తుంది? ఎన్నివేలు ఖర్చు అవుతాయి? దానిని నేనెట్లు సహించగలను? నేనైతే మహాలోభిని. నేడు నీవు రెండవ అర అడిగినావు. ఒక ప్రత్యేక రైలుపెట్టె (సెలూన్) అడిగినా దొరికేది. కాని అట్లడుగుట మనకు ఒప్పుతుందా? రెండవ అరను నీ వడగుట ప్రత్యేక రైలుపెట్టె నడుగుటతో సమానం. నాయందు నీకుగల అమితప్రేమవల్లనే ఇదంతా చేస్తున్నావని నే నెరుగుదును. కాని నేనైతే నిన్ను ఉన్నత పథాలకు తీసికొనపోవుటకు పాటుపడ గోరుతున్నాను. నిన్ను చెడ గొట్టుటకు కాదు. నీవు కూడా ఈ సంగతి తెలిసికోవాలి. నేనిట్లా చెప్పుతుంటే నీవు కంటినీరు కారుస్తున్నావు. నేను చెప్పుచున్నది అర్థమవుతుంటే అట్లా కంటినీరు కార్చవు. దీనికి ప్రాయశ్చిత్తంగా సామానంతా నీవు ఈ అరలోనికి తీసికొని వచ్చి, వచ్చే స్టేషన్‌లో స్టేషన్‌మాస్టరును నావద్దకు పిలుచు కొనిరా."

నేనైతే గడగడ వణకుచుంటిని. సామాను తీసికొని వచ్చాను. కాని 'బాపు' విషయమై నాకు బెంగపట్టుకొన్నది. ఇక ఏమి చేస్తాడో? ఇది ఎట్లా పరిణమించుతుందో? అని. ఎందుకన్న ఇతరులవల్ల జరిగిన ఇట్టి చిన్న తప్పులను తనవిగానే భావించుకొని వాటికొరకు 'బాపు' ఉపవాసంచేయటం కద్దు. అదేవిధంగా దీనికొరకు ఒకటి రెండుపూటలు భోజనం మానివేస్తాడేమో! అట్లు ఉపవాసం చేస్తూకూడ చదువుట, వ్రాయుట, నూలువడకుట, నాకు చదువుచెప్పుట, మట్టిని పట్టుగా వేసుకొనుట మొదలగు పనులన్నీ ఇంట్లోవలనే రైల్లోకూడ 'బాపు' చేస్తూ ఉండేవాడు.

ఆఖరికి స్టేషన్ వచ్చింది. 'బాపు' స్టేషన్‌మాస్టరును పిలిపించి—"ఈ పిల్ల నా మనుమరాలు. అమాయకురాలు. కల్లాకపటం లేనిది. నన్నింకా బహుశః సరిగా అర్థం చేసికో లేదు. అందుచేత రెండు అరలున్న పెట్టె తీసికొన్నది. ఇందులో దీనితప్పులేదు. తప్పు నాదే. ఏదో కొంతలోపం నా శిక్షణలో ఉండి ఉండాలి. దానికి ప్రాయశ్చిత్తం మేమిద్దరం చేసుకోవలసి ఉంది. మేము రెండవ అరను ఖాళీచేశాము. రైలుపెట్టెల కమ్ములపట్టుకొని వ్రేళ్లాడే వారికొరకు దానిని ఉపయోగించండి. అప్పుడే నాకు దుఃఖోపశమనం కాగలదు," అని చెప్పినాడు.

స్టేషన్‌మాస్టరు చాలా ప్రార్థించినాడు. కాని ఏమన్నా వినే మనిషా 'బాపు.' స్టేషన్‌మాస్టరు పెట్టెల పట్టుకొని వ్రేళ్లాడుతున్న వారికొరకు వేరేపెట్టెలు వేయిస్తాననికూడ అన్నాడు. దానికి 'బాపు'—"సరే. వేరేపెట్టెలుతప్ప కుండా తగిలించండి. కాని ఈ అరనుకూడా ఉపయోగిం చండి. ఇది మాకు అవసరంలేదు. దానిని మేము ఉపయో గించటం హింస. దొరికే సదుపాయాలను దుర్వినియోగం చేయించి మీరు ఈ పిల్లను పాడుచేయదలచుకొన్నారా? అని అడిగినాడు. పాపం స్టేషన్‌మాస్టరు సిగ్గుపడిపోయాడు. 'బాపు' చెప్పింది ఆయన ఒప్పుకోవలసి వచ్చింది.

యావద్భారత దేశానికి 'బాపు' తండ్రి కదా? తన పిల్లలు పెట్టెకమ్ముల పట్టుకొని వ్రేళ్లాడుతూ ప్రయాణం చేస్తుంటే సుఖంగా ఆయన ఎట్లుండగలడు? దీనివల్ల వ్రేళ్లాడు తున్న జనులందరికి పెట్టెలలో స్థలం దొరికింది. దొరికే సౌఖ ర్యాలను వీలైనంత తక్కువగా ఉపయోగించుకోవాలన్న అమూల్యమైన గుణపాఠం నాకు దొరికింది. అప్పుడుమాత్రం ఆయన మందలింపు నాకు రుచించలేదు. కాని, నేడు దానికి సాటివచ్చేది నా జీవితంలో ఇంకేముంది? అంత సూక్ష్మతర మైన అంశాలనుకూడా పాటిస్తూ, అహింసను సాధిస్తూ, 'బాపు' తన జీవితాన్ని తీర్చి దిద్దుకున్నాడు. దానినుండి ఏ

కొద్దిపాటి లాభాన్నైనా పొందటానికి నాకు దొరికిన అవకాశాన్ని నా జీవితమంతా మరవబోను.

## ౬. నియమము లేకపోవుట పాపము

నోఆఖాలీలో ఒక గ్రామంనుండి ఇంకొక గ్రామానికి కాలినడకను పోవుటకు పూజ్యుడగు 'బాపు' సరిగా ఏడు గంటలకు బయలుదేరేవాడు. ఏడు తర్వాత రెండు నిమిషాలు ఆలస్యమైనా ఆయన మనస్సునకు చాలా కష్టంగా ఉండేది. ఒకరోజు సామాను కట్టడంలో నాకు కొంచం ఆలస్యమైంది. ఎందుకంటే సామానులోని కొన్ని వస్తువులు 'బాపు' లేచిన తర్వాతనే మూటలో పెట్టవలసి ఉండేది. వాటిని కట్టడంలో అయిదు నిమిషాలు ఆలస్యమైంది. దానికి బాపు—"చూడు! కీర్తన గావించేవారు, గ్రామవాసులు ఎంత సేపటినుండో బైట కనిపెట్టుకొని ఉన్నారు. కాని నీవు యింకా సిద్ధం కాలేదు. అయిదు వందలమంది మనుష్యులనుండి నీవు అయిదు నిమిషాలు దొంగిలించావు. ఇది సహించరానిది. నేనైతే వెళ్లుతాను. నీవు వెనుకనుండి రావలసింది. ఇంత కాలం వృథా అయింది. ఇది నా కేమాత్రం బాగుండలేదు. నే నిప్పుడు వెళ్లుతున్నానని, నీవు ప్రతిరోజు ఆలస్యంచేసి తర్వాత రావచ్చునని అనుకోవద్దు. నేను ముసలివాడనని,

నీవు చిన్నదానివని, ఆలస్యమైనా పరుగెత్తుకొనివచ్చి నన్ను కలుసుకోవచ్చు ననుకొంటున్నావేమో— కాని అట్లు చేయటం పాపం. ఎప్పుడూ నియమం కలిగి ఉండాలి. పని అంతా వేళపట్టున జరగాలి. ఎవరితోనైనా ఏడు గంటలకు బయలు దేరుతానని చెప్పితే—బయలుదేరటంలో రెండు క్షణాలు ఆలస్యమైనా నాకు గుండెల్లో శూలం గ్రుచ్చుకొన్నంత బాధ కలుగుతుంది," అని అన్నాడు.

## ౭. రాయి మరచినందుకు శిక్ష

నోఆఖాలీలో నారాయణపురం అనే గ్రామం ఉంది. ప్రతిరోజువలె 'బాపు' అక్కడకు ఏడు గంటలకు చేరు కున్నాడు. ఒక బీద సాలెవాని ఇంట్లో మేము దిగినాము. గ్రామం చేరటంతోడనే వేడినీటితో 'బాపు' తన పాదాల కడిగించుకొనేవాడు. తర్వాత వ్రాత మున్నగు పనులు చేసు కొనేవాడు. అంతలో నేను ఆయన శరీరమర్దనానికి, స్నానానికి అంతా సిద్ధంచేసే దానిని. ఆ దినంకూడా మామూలు విధంగా తయారుచేశాను. 'బాపు' స్నానం చేసేటప్పుడు సబ్బు నెప్పుడు ఉపయోగించేవాడుకాడు. ఒక గరుకురాయిని ఉప యోగించేవాడు. దానిని మీరాబహన్ ఎన్నో ఏండ్ల క్రిందట ఆయన కిచ్చింది. మేము వీడివచ్చిన గ్రామంలో నేను దానిని

మరచి వచ్చాను. స్నానపుగదిలో వస్తువులన్నీ పెట్టేటప్పటికి నాకు దాని జ్ఞాపకం వచ్చింది. అప్పుడు 'బాపు' వద్దకుపోయి— "'బాపూ' మీ రాయిని నేను ఎక్కడో మరచి వచ్చాను. బహుశః నిన్నటి సాలెవాని ఇంట్లో అది ఉండిపోయి ఉండును. ఇప్పుడు నేనేమిచేసేది?" అని అన్నాను. 'బాపు' కొంచెము సేపు ఆలోచిస్తూ ఉండి తర్వాత—నీవు పొరపాటు చేశావు. స్వయంగా వెళ్లి ఆ రాయిని వెతికి తీసికొని రావలసింది. నిర్మల బాబుతో చెప్పితే ఆయన నా భోజనం తయారుచేయగలడు. కాని రాయిని వెతికి తెచ్చుటకు నీవు ఒక్కదానివే పోవాలి. ఒక్కసారి అట్లా చేస్తే నీకు రెండవసారి జ్ఞాపకం ఉంటుంది," అన్నాడు. నేను భయపడుతూ, భయపడుతూ—"ఏం 'బాపూ'! గ్రామంలో యింతమంది స్వయం సేవకులున్నారు గదా? వారిలో ఒక్కరిని వెంటతీసుకొని పోనా?" అని అడిగినాను. దానికి 'బాపు' "ఎందులకు?" అని ప్రశ్నించాడు. దానికి నేను జవాబు ఇయ్యలేక పోయాను.

నోఆఖాలీలో దట్టమైన పోకతోటలు, కొబ్బరితోటలు ఎన్నో ఉన్నాయి. క్రొత్తవారెవ్వరైనా సరే వాటిలో దారి తప్పిపోతారు. అదికాక మతకలహాలనే తుఫానురేగిన రోజులవి. ఆదారిలో ఉన్నవన్నీ ముసల్మానుల ఇండ్లే. దారి అంతా పాడుపడినది. జనశూన్యము. ఒంటిగా పోవటం

ఎట్లా ? కాని చేసిన పొరపాటో ? అందుకనే నేను 'బాపు' "ఎందులకు ?" అన్న ప్రశ్నకు జావాబు చెప్పకుండ కొంత కోపంతో బయలుదేరాను. ఎక్కడినుండైనా ఎవరైనా గుండాలు వచ్చి మీాద పడతారేమో అన్న భయంకూడా హృదయంలో ఉంది. కాని రామనామం జపిస్తూ, ఏ దారినైతే మేము వచ్చామో ఆ దారిని, అడుగుజాడలు చూసుకుంటూ పోయాను. ఏదో విధంగా ఆ సాలెవాని ఇల్లైతే మాత్రం దొరికింది. ఆ ఇంట్లో ఒక్క ముసలిది మాత్రమే ఉండేది. ఆ రాయి యింత విలువైనదని ఆ ముసలిదానికేమి తెలుసు ? పాపమామె దానిని బయట పారవేసింది. ఏదోవిధంగా ఎంతో కష్టంతో నేను దానిని వెదికినాను. అది దొరికేటప్పటికి నాకు అంతులేని ఆనందం కలిగింది. దానిని తీసికొని త్వరగా నారాయణపురం రాస్తా వెంట పడ్డాను. ప్రొద్దున్న తొమ్మిదిన్నరకు బయలుదేరినదానిని మధ్యాహ్నం ఒంటిగంటకు నారాయణాపురం తిరిగివచ్చాను. ఆకలైతే దహించుకొని పోతున్నది. కాని దాని కంటే ఎక్కువగా, కొద్దిపొరపాటువల్ల కొన్ని గంటలు 'బాపు' సేవచేయకుండా ఉండిపోవలసివచ్చినందుకు, దుఃఖము కలిగింది. ఆ కారణం వల్ల 'బాపు'నకు రాయిని ఇస్తుంటే నాకు ఏడుపు వచ్చింది.

'బాపు' అప్పుడు నాతో—"చూడు ! నేను నీ పరీక్ష

అయింది. భగవంతుడు అంతా మన బాగుకొరకే చేస్తాడు. జ్ఞాపకం ఉందా? నీవు నా దగ్గరకు వచ్చిన మొదటి రోజు రాత్రి రెండు గంటలప్పుడు నా యాత్రయనే యజ్ఞంలో వెంట నుండటానికి చాలా ధైర్యం ఉండాలని, కొంచమైనా అధైర్య పడితే నిన్ను 'ఫెయిల్' (ఓడిపోయినట్లు నిర్ణయించుట) చేస్తానని, అందుచేత ఇష్టమైతే ఇప్పుడైనా 'మహువా' తిరిగి వెళ్లవచ్చునని, కాని యాత్ర మొదలైన తర్వాత ఎక్కడికి వెళ్లటానికి వీలులేదని చెప్పిన సంగతి జ్ఞాపకం ఉందా? ఈ రాయి నిమిత్తం నీ మొదటి పరీక్ష జరిగింది. దాంట్లో నీవు నెగ్గినందులకు నాకెంత సంతోషంగా ఉంది! ఈ రాయి పాతిక సంవత్సరాలనుండి నా వెంట ఉంది. జైలులోనికి, మహాలులోనికి నేను ఎక్కడికి పోయినా నా వెంట ఉంటుంది. ఇది పోతే నాకు, మీరాబహానుకు చాలా దుఃఖము కలుగుతుంది. మరి నీవుకూడా ఒక పాఠం నేర్చుకున్నావు. 'ఇటువంటి రాళ్లు ఎన్నో దొరకుతాయి. ఇది పోతే ఇంకొకటి చూసుకోవచ్చును,' అని అజాగ్రత్తగా ఉండరాదు. పనికివచ్చే ప్రతి వస్తువును జాగ్రత్తగా ఉంచుకొనటం నేర్చుకోవాలి" అని చెప్పినాడు. అప్పుడు నేను, "కాని 'బాపూ' ఎప్పుడైనా రామనామం నేను మనస్ఫూర్తిగా జపిస్తే అది ఈనాడే. భయంకరమైన ఆ దారిని పోతుంటే నాగుండె దడదడ కొట్టుకొనేది,"

అని అన్నాను. 'బాపు' ఒక్క నవ్వునవ్వి—"అవును దుఃఖములోనే రాముడు జ్ఞాపకం వస్తాడు," అని అన్నాడు.

## ౮. 'బాపు' లోభం

ఒకమారు ప్రొద్దున్న 'బాపు' త్రాగుటకు వేడినీళ్లు నేను కాచుటలో కొంచం ఆలస్యమైంది. అక్కడ గాలి చల్లగా ఉండటంవల్ల పొయ్యి అంటుకోలేదు. అందుచేత నా చీర అంచును చింపి, కిరసనాయిలులో తడిపినాను. వెనుక నుండి 'బాపు' ఇదిచూసి—"కొంచెమా పేలిక నాకు చూపించు" అని అడిగినాడు. నేను చూపించాను. దానిని ఆయన విప్పి—"అమ్మో! ఇదైతే బొందుకు (నాడాగా) పనికివచ్చే పేలిక. దీనిని తగుల బెట్టుట ఎట్లా? ఉతికి ఎండ బెట్టు. బొందుగా పనికివచ్చే పేలికను పొయ్యి అంటించటానికి ఉపయోగించ వచ్చునా? నేనెంత లోభినో నీకు తెలుసునా? వేడినీళ్లు కొంచం ఆలస్యంగా దొరికితే ఏమవుతుంది? ఈ పేలిక ఎంతనూనెను త్రాగివేసింది? అదిగాక దీనిపై నా దృష్టి పడక ఉంటే ఈ పాటికి తగులబడిపోయి ఉండేది కాదా?" అని అన్నాడు. అంతట నేను—"బాపూజీ! ఇప్పుడింతలోభం యెందుకు?" అని అన్నాను. ఆయన పరిహాసం చేస్తూ— "అవును, నీవైతే ఉదారుడైన తండ్రి కూతురువి. నా తండ్రి

కూర్చొని లేదు కదా! నీకు దొరకినట్లు నాకు అన్నీ దొరక టానికి ?" ఇంతమాత్రం అని గంభీరుడై—"చూడు! నా వేళాకోళంలో కూడా ఎప్పుడూ గంభీరార్థం ఉంటుంది. దానిని తెలిసికొనటం నీకు తెలిస్తే నాకుచాలు," అని పల్కినాడు.

ఆఖరికి ఆ గుడ్డపేలిక ఎండిన తర్వాత దానిని నాచేత బొందుగా ఉపయోగింపచేసిన పిమ్మటనే 'బాపు'నకు సంతోషమైంది. దగ్గర ఉన్న గడ్డితో, చెత్తతో పొయ్యి రాజె య్యటం కూడా నాకప్పుడు ఆయన నేర్పినాడు.

దేశాన్ని ఎదుర్కొనుచున్న ఆ మహాసమస్యలలో చిక్కుకొని ఉండికూడ, అట్టి చిన్నవిషయాల నేర్పటంలో 'బాపు' నకు మహానందం కలుగుతుండేది.

## ౯. చెప్పటకంటె చెయ్యటం మంచిది

పరిశుభ్రత విషయమై 'బాపు' ఎప్పుడు ధ్యానముంచే వాడు. బాహ్య పరిశుభ్రత ఆయన కావాలనేవాడు. కాని అంతరంగ పరిశుద్ధత ఆయన పనుల కొక ప్రత్యేక అంగమై పోయింది. ఏదైనా పని పరిశుభ్రంగా చేయబడకపోతే మాటిమాటికి దానివిషయమై చెప్పేదానికి బదులు ఆయన తన చేతులతో దానిని చేసి ఎదటివారికి పరిశుభ్రత అంటే ఏమిటో నేర్పేవాడు.

నోఆఖాలీలోని దారులు చాలా ఇరుకుగా ఉండేవి. అందులో కొన్ని 'బాపు', నేను ఒకరిప్రక్క ఇంకొకరం నడవటానికి వీలులేనంత ఇరుకుగా ఉండేవి. ఆ దారులలో ఆయన ఒంటిగానే నడవవలసి వచ్చేది. నా ఆసరా లేనందువల్ల ఆయన ఒక చేతిలో కర్రనొకదానిని ఉంచుకొనవలసి వచ్చేది. దారిలో ఎక్కడైనా ఉమ్ములు, మలమూత్రములు మున్నగునవి కనబడితే ఆయనకు చాలాబాధ కలిగేది. ఆ అపరిశుభ్రమైన మార్గాలలో మేము వట్టికాళ్లతో నడవవలసి వచ్చేది.

ఒకనాడు ప్రక్కనున్న ఆకలములనుతీసికొని దారిలో ఉన్న అశుద్ధాన్ని తనచేతితో 'బాపు' బాగుచేయటం మొదలుపెట్టినాడు. గ్రామవాసులు ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయారు. నేను కొంచం వెనుక వస్తున్నాను. అది నా కళ్లబడుటతోడనే నేనుకూడ స్థబ్ధురాలనై పోయాను. తర్వాత కోపంతో—"'బాపు' నన్నెందుకు సిగ్గుపడ జేస్తావు? నేను నీ వెనుకనే ఉన్నాను. నన్ను పిలిచి నాచేత చేయించకుండా స్వయంగా ఎందులకు శుభ్రం చేశావు?" అని అడిగినాను.

దానికి 'బాపు' నవ్వి—"ఇట్టిపనులలో నా కెంత ఆనందం కలుగుతుందో నీకు తెలియదు. నీకు చెప్పి చేయించటం కంటె నేను స్వయంగా చేసికొనటం వల్ల నాకు తక్కువ శ్రమ కలుగుతుంది గదా?" అని జవాబిచ్చాడు. "మరి

గ్రామవాసులంతా చూస్తూ ఉండటమో" అని నే నన్నాను. 'బాపు'—"చూడు, రేపటినుండి నాకిట్లు దుర్గంధంతో నిండిన దారులు బాగుచేసే అవసరం పట్టదు. ఏలనంటే నేడు నేను చేసిన దానివల్ల ఈ పనికూడ చాలా ముఖ్యమైందని వీరందరికి అర్థమవుతుంది. అదిగాక వీరు నా కొరకే దారులు శుభ్రంగా ఉంచటం మొదలుపెట్టినా నాకు బాధ ఉండదు." అని ప్రత్యుత్తరమిచ్చాడు. దానికినేను—"రేపుమాత్రం గ్రామ వాసులు దారులు బాగుచేసి, తర్వాత వాటిని మామూలు మాదిరిగా వదలివేస్తే మీరు ఏమి చేస్తారు?" అని నేను అడిగినాను. ఈ ప్రశ్నకు జవాబుగా 'బాపు' నన్నే ఇరుకు లో పడవేశాడు.—"అట్లయితే వాటిని చూడటానికి నేను నిన్నే పంపుతాను. దారి ఇదేవిధంగా అశుభ్రంగా ఉంటే బాగుచేయటానికి మరల నే నిక్కడికి వస్తాను. శుభ్రంగా లేని దాన్ని శుభ్రంచేయటమే నా పని," అని చెప్పినాడు.

నిజంగా అట్లాగే జరిగింది. మరునాడు నేను చూడ టానికి వెళ్లేటప్పటికి దారి అదేవిధంగా అశుభ్రంగా ఉంది. అది 'బాపు'నకు చెప్పేందుకు వెళ్లేబదులు నేనే దానిని శుభ్రంచేసి తిరిగివచ్చాను. వచ్చి 'బాపు'తో—"నేను దారిని శుభ్రంచేసి వచ్చాను. గ్రామవాసులుకూడ నాతో కలిసి పనిచేశారు. రేపటినుండి వారంతట వారే బాగుచేసుకుంటా

మని వారు మాటకూడ ఇచ్చారు. మీరు అక్కడికి పోవలసిన అవసరంలేదు” అని చెప్పినాను. అది వినుటతోడనే— ‘బాపు’ “అరెరే! నా పుణ్యం నీవు లాగుకొన్నావు. ఆ దారిని నేనే శుభ్రం చేయవలసి ఉంది. సరే పోనీ, రెండు పనులైతే జరుగుతాయి. ఇకముందు దారులు శుభ్రంగా ఉండటం ఒకటి. ప్రజలు తమ వాగ్దానాలు పాలించితే వారికి సత్యఫలం లభించటం రెండవది.” దీనితర్వాత ఆ దారి ఎప్పుడు శుభ్రంగానే ఉండింది.

పై ఘటన విషయం మూడు నాలుగు రోజుల తర్వాత మాట్లాడుతూ ‘బాపు’—“దారుల అశుభ్రంచేసే దురల వాటు మన కాఠియవాడు ప్రజలకుకూడా ఉంది. వీధులలోను, దారులలోను—ఎక్కడపడితే అక్కడ ఉమ్మివేయటం, మల విసర్జన చేయటం నోఆఖాలీ ప్రజలలోనే ఉందని నీవు అను కొనవద్దు. ఈ దురలవాటు భారతదేశంలోని అన్ని ప్రాంతా లలో ఉంది. అందులో కాఠియవాడులో మరీ ఎక్కువ. ఈ దురలవాటును రూపుమాపాలనే ఇచ్ఛ చిన్నతనంలో నాకుం డేది. కాని చాలకాలం నేను కాఠియవాడులో స్థిరంగా ఉండటం తటస్థించలేదు. నేనే స్వయంగా బాగుచేసినందుకు నీకు నామీద కోపంవచ్చింది. అది సరికాదు. నేను ఆహారం తిననిదే నా కడుపు ఎట్లా నిండదో అట్లాగే నేనే స్వయంగా

శుభ్రం చేయకపోతే నాకు సంతోషం కలుగదు. అది నా కలవాటు అయిపోయింది. పరిశుభ్రం చేయటంలో నాకు అపరిమితానందం కలుగుతుంది."

## ౧౦. నిజమైన డాక్టరు రాముడే

నోఆఖాలీలో 'ఆమకీ' అనే గ్రామం ఒకటి ఉంది. అక్కడ 'బాపు' కోసం మేకపాలు ఎక్కడా దొరకలేదు. అన్నిచోట్లా వెదకి వేసారిన తర్వాత ఆ సంగతి నేను 'బాపు' నకు తెలియజేశాను. దానికి 'బాపు'—"దొరకకపోతే నష్టమేముంది? కొబ్బరిపాలు మేకపాలకు బదులుగా బాగా పనికి వస్తాయి. మేక నెయ్యికి బదులు అప్పటికప్పుడు కొబ్బరి నూనె తీసి ఉపయోగించుదాము," అని అన్నాడు. తర్వాత కొబ్బరిపాలు, నూనె తీసే పద్ధతిని నాకు చూపించాడు. నేను వాటిని తీసి ఆయనకిచ్చాను. 'బాపు' మేకపాలు ఎప్పుడూ ఎనిమిది ఔన్సులు తీసుకొనేవాడు, కొబ్బరిపాలుకూడా అంతే తీసుకొన్నాడు. కాని అవి జీర్ణం చేసికొనటం ఆయనకు కష్టమైంది. విరోచనాలు అవటం మొదలైంది. అందువల్ల సాయంకాలానికి, ఊరుబయటనుండి పాకలోనికి రాబోతుంటే తల-తిరిగేటంత నీరస పడినాడు ఆయన.

'బాపు'నకు తల తిరిగేముందు దాని చిహ్నాలు కన బడుతూ ఉండేవి. ఆయనకు ఆవలింతలు ఎక్కువగా వచ్చేవి. చెమట పట్టేది. కాళ్లూ చేతులూ చల్లబడేవి. కళ్లుకూడా తిరిగేవి. అందువల్ల ఆయనకు ఆవలింతలు వస్తూ ఉండటం చూసి ఇక ఆయనకు తల తిరగబోతున్నదని అనుకొన్నాను. అయినా నాలుగడుగులలోనే ఉన్న పక్కదగ్గరకు ఆయన చేరగలడనుకున్నాను. కాని నేను పొరపాటుపడినాను. నా సహాయంతో నడుస్తూనే 'బాపు' తొట్రిల సాగినాడు. జాగ్రత్తగా ఆయన తల పట్టుకొని నిర్మలబాబు కొరకు నేను గట్టిగా కేక వేశాను. ఆయన వచ్చాడు. మేమిద్దరం కలిసి 'బాపు'ను పక్కమీద పడుకొనబెట్టినాము. అంతట—"ఒకవేళ 'బాపు' నకు జబ్బు ఎక్కువయితే లోకులు నన్ను మూర్ఖురాలంటారు. దగ్గర గ్రామంలో సుశీలా బహన్ ఉంది, ఆమెను పిలువ కూడదా?" అన్న ఆలోచన నాకు వచ్చింది. తక్షణమే ఆమెకు చీటివ్రాసి దానిని పంపటానికి నిర్మలబాబు చేతిలో పెట్టినాను. ఇంతలో 'బాపు'నకు స్పృహవచ్చి 'మనూడీ' అని నన్ను పిలిచాడు. (గారాబంతో పిలిచేటప్పుడు నన్ను 'బాపు' 'మనూడీ' అనేవాడు) నేను దగ్గరకు వెళ్లగానే ఆయన—"నీవు నిర్మలబాబును కేకవేసి పిలిచావు. అది నాకెంతమాత్రం రుచించలేదు. ఇంకా నీవు చిన్నపిల్లవు. అందు

చేత నిన్ను క్షమించగలను. కాని నీవు ఎవ్వరిని పిలవకుండా, హృదయపూర్వకంగా రామనామం జపించుతావని నే నాశించాను. మనస్సులో నేను రామనామస్మరణ చేస్తూనే ఉంటిని. నిర్మలబాబును పిలవకుండా నీవుకూడ రామనామ జపంచేస్తూ ఉండిఉంటే నాకెంతో బాగుండేది. అయితే చూడు—ఈ సంగతి సుశీలతో చెప్పవద్దు. చీటీ వ్రాసి ఆమెను పిలిపించవద్దు. ఎందుకంటే నా నిజమైన డాక్టరు నా రాముడే. ఎంతవరకు నానుండి పనితీసుకొనదలచుకొన్నాడో అంతవరకు నన్ను జీవములతో ఉంచుతాడు. ఉంచటం ఆయనకు ఇష్టం లేకపోతే తీసికొని పోగలడు" అని ఆయన అన్నాడు.

'సుశీలను పిలిపించవద్దు' అన్న మాటలు వినగానే నేను కంపించి పోయాను. వెంటనే నిర్మలబాబు చేతిలోనుండి చీటీని లాగుకొని చింపి వేశాను. "ఏం నీవు చీటీని వ్రాశావు కదూ?" అని 'బాపు' ప్రశ్నించాడు. గత్యంతరంలేక ఒప్పుకొన్నాను. అప్పుడు 'బాపు'—"నేడు నిన్ను, నన్ను ఈశ్వరుడు రక్షించాడు. ఈ చీటీని చదువుకొని, సుశీల తన పనిని వదలివేసి నావద్దకు పరుగెత్తుకొని వచ్చుట నాకెంత మాత్రం ఇష్టం ఉండదు. నీమీాద, నామీాదకూడ నాకు కోపం వస్తున్నది. నేడు నా పరీక్ష జరిగింది. రామనామమనే తారక మంత్రం నా హృదయమంతా నిండి ఉంటే నే నెప్పుడు

రోగంతో చనిపోను. ఈ నియమం నా ఒక్కడికే గాక అందరికి వర్తిస్తుంది. ప్రతివానికి, వాని పొరపాటుల ఫలితం అనుభవించవలసి ఉంటుంది. నే ననుభవించిన దుఃఖము నేను చేసిన ఏదో పొరపాటుయొక్క పరిణామమే. అయినప్పటికిని కొన ఊపిరి ఉన్నంతవరకు రామనామస్మరణ చేస్తూనే ఉండాలి. అది చిలకపలుకులవలె కాదు, మనస్ఫూర్తిగా. రామాయణంలో ఒక కథ చెప్పబడింది. హనుమంతునకు సీతామ్మవారు ముత్యాలహారం ఇచ్చిందట. ఆ హారంలోని ముత్యాలలో రామనామం ఉందో లేదో చూడగోరి హనుమంతుడు వాటిని ముక్కలు ముక్కలుగా చేసినాడట. ఈ కథ నిజమా అబద్ధమా అన్నమాట మనకెందుకు? హనుమంతుని కున్నట్టి కొండ లాంటి శరీరాన్ని మనం సాధించలేక పోయినా, అతని ఆత్మవంటి ఆత్మగా మన ఆత్మను తప్పకుండా చేసుకోగలము. ఈ ఉదాహరణను కావాలంటే ఎవ్వడైనను ఋజువుచేయగలడు. ఒకవేళ అతడు దానిని ఋజువుచేయలేక పోయినా దానిని సాధించడానికి ప్రయత్నించితేచాలు. మనుష్యుడు ప్రయత్నం చేయవలసిందని, ఫలితం సంగతి ఈశ్వరునికి వదలివేయవలసిందని గీతామాత చెప్పనే చెప్పింది. కాబట్టి, నీవు, నేను, అందరూ ప్రయత్నం చేయాలి. నీకుగాని, నాకుగాని, ఇంకెవరికైనాగాని రోగంవస్తే దానిపట్ల నా వైఖరి

ఎట్లుంటుందో ఇప్పుడు నీవర్థం చేసుకొన్నావనుకుంటాను" అని చెప్పినాడు.

ఆ నాడే జబ్బుగానున్న ఒక సోదరికి వ్రాస్తూకూడ 'బాపు' ఇదే వ్రాశాడు—"లోకంలో తిరుగులేని మందు ఏదైనా ఉంటే అది రామనామమే. కాని దానిని జపించగోరు వారు, అందులకు అధికారాన్ని సంపాదించటానికి ఏయే నియమాలను పాటించాలో వాటి నన్నింటిని తప్పకుండా పాటించి తీరవలసి ఉంటుంది. ఈ రామబాణమును ఉపయోగించే యోగ్యత మనకెక్కడ ?" అని అందులో ఉంది. (నా నోఆఖాలీ డైరీనుండి)

పై సంగతి 1947వ సంవత్సరం జనవరి 30వ తేదీన జరిగింది. సరిగా 'బాపు' మృతికి ఒక సంవత్సరం ముందు.

రామనామం మీద ఆయనకుగల భక్తి తుదివరకు అచంచలంగానే ఉండింది. 1947వ జనవరి 30వ తేదీనాడు ఈ మధురఘటన ఘటిల్లింది. 1948వ జనవరి 30వ తేదీన 'బాపు' నాతో—"ఊపిరి ఉన్నంతవరకు రామనామాన్ని మనం జపిస్తూనే ఉండాలి" అని అన్నాడు. 'బాపు' నోటినుండి ఆఖరి సారికూడ—"రామ్, రా—మ్" అని వినుట విధినాకే వ్రాశాడని నాకెట్లు తెలుస్తుంది ? భగవత్సంకల్పం ఏమిటో తెలిసికో గలిగింది ఎవ్వరు ?

# ౧౧. ఒక్క క్షణమైన వృథా చేయరాదు

తనతోటి కార్యకర్తలను వేరువేరు గ్రామాలలో ఉంచి నప్పటినుండి పూజ్యుడగు 'బాపు'నకు కార్యభారం చాలా ఎక్కువై పోయింది. ఆర్గురు మనుష్యులు అతికష్టం మీద పూర్తి చేయగలగినంత ఆఫీసు పని ఆయనకుండేది. ఆ ఆర్గురు మనుష్యుల పనిని ఇప్పుడు 'బాపు', నిర్మల బాబు—ఇద్దరే చక్కబెట్టుకొనవలసి ఉండేది. నిర్మల బాబు ఒక్కడు, అందు లోను క్రొత్తవాడు. ఇంగ్లీషు, బెంగాలీ భాషలలోనే ఆయన పని చేయగలడు. అందుచేత గుజరాతీ, హిందీ, మరాఠీ మున్నగు ఇతర భాషలకు సంబంధించిన పని అంతా 'బాపు' తలమీద పడింది. ఇదిగాక ఆయన ఇతరులను కలిసి మాట్లాడ వలసి ఉండేది. తన ప్రార్థనా ప్రవచనాలను తగురీతిని పత్రి కలకిచ్చే పనిని కుడా ఆయనే స్వయంగా చూసుకోవలసి వచ్చేది. ఏలనన పత్రికా విలేఖరులు ఆయన ప్రవచనాలను ప్రభావవంతమగు రీతిని తమ వ్రాతలలో తరుచు ఇముడ్చలేక పోయెడివారు. తాను చెప్పినదానికి తప్పుడు అర్థం రాకుండా ఉండాలని 'బాపు' ఆ విషయంలో కూడ స్వయంగా జాగ్రత్త పుచ్చుకొనేవాడు.

అన్నిటికంటె కష్టమైనపని—ఏ వస్తువు పోకుండా ప్రతి దినం సామాను కట్టుకొనడం. ఈ భారం నా తలపై ఉన్నప్పటి

కిని, సకాలంలో సామాను కట్టుకొని నేను తయారుకావాలని, దీని విషయంకూడా 'బాపు'నకు శ్రద్ధపుచ్చుకోవలసివచ్చేది. విశ్రాంతి ఏ మాత్రం ఉండేది కాదు. ఒక్క గ్రామంలోనే అయిదారేండ్ల తర్వాత ఒక యింటినుంచి ఇంకొక యింటికి మారవలసి వస్తే మనకు ఎంత విసుగ్గా ఉంటుందో అందరికి అనుభవంలో ఉన్నమాటే. మరి యిక్కడయితే ప్రతి రోజు ఇల్లు మారటమే.

'బాపు' సామాను ఏమంత ఉంటుందని చాలామంది మనస్సులలో అనుకొనుచుండవచ్చు. ఇతరులకు బరువు కాకుండా తాను ఉండాలని తన కవసరమైన వస్తువులన్నీ ఆయన తనవెంట ఉంచుకొనేవాడు. ఆయనకు అవసరమయ్యే వస్తువులు ఒక్క కాగితంపెన్నళ్లే గాదు. సూది దారం మొదలుకొని వంట వండుకొనే 'కుక్కరు', అప్పడాలకర్ర, రొట్టెల పెనము, పట్కారు, చిమ్టా, తప్పేలాలు రెండు, పళ్లెము, భోజనం చేయటానికి ఉపయోగించే చిన్న రాతి చిప్ప లేక మట్టి చిప్ప, కొయ్యచంచా (అన్నం తినేందుకు), గ్లాసు, స్నానం చేయటానికి బకెట్ లేక బాల్టీ, సబ్బు, కమోడ్ (మలవిసర్జనకు) మొదలుగాగల వస్తువులన్నీ వెంటనుంచుకోవలసిందని మాకు నిర్దేశింపబడింది. నోఆఖాలీలో పూరిండ్లన్నీ తగులబడిపోయినాయనిగాని, అక్కడ ఇవేవిదొరకవనిగాని గాదు వీటిని

మేము వెంటనుంచు కొనటానికి కారణం. 'బాపు' నకు తన వస్తువులనే ఉపయోగించుకొనటం ఇష్టం కాబట్టి. ఇదిగాక ఆయన ఆఫీసుపనికి పనికివచ్చే చంకసంచీ ఒకటి ఉండేది. అది ఎటువంటిదంటే అందులోనుండి ఒక్క కాగితంముక్క పోయినా ఆయన పనులన్నీ ఆగి పోయేవి. ఆ సంచిలో గీత, రామాయణం, బైబిలు, కురాన్ షరీఫ్, భజనావళి, పండిత్ నెహ్రూ సర్దారు పటేలు లాంటి వాండ్ల ఉత్తారాలు, పోస్టుద్వారా వచ్చిన ఉత్తరాలలో ఒక వైపే వ్రాసి ఉన్న కాగితాలను ఉపయోగించటానికి 'బాపు' జాగ్రత్త పెట్టుకొన్నవి, అట్టి కాగితాలపై ఆయన వ్రాస్తూఉన్న కొన్ని జవాబులు, ఇటువంటి వెన్నో వస్తువులుండేవి. ఈ విలువైన సంచి బాధ్యత నామీద ఉండింది. అప్పటికిని 'బాపు'—"ఏదైనా పోతే నీవు తప్పించు కొంటావు. కాని నేను కూడా బాధ్యతనుండి తప్పించుకో గలనా?" అని అంటూ ఉండేవాడు. ఈ వాక్యాన్ని బట్టి ఆ సంచి 'బాపు' నకు ఎంత ప్రాణప్రదమైనదో పాఠకులు గ్రహించగలిగి ఉందురు. "ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క రోజే గదా గడపవలసింది, ఆసంచిలో వస్తువులన్నీ ఏలాగో ఓలాగు పడవేస్తే ఏమవుతుంది?" అని నేను అనుకొనేందుకు వీలుండేది కాదు. ఎందుకంటే హఠాత్తుగా నేను వస్తువులుంచే పద్ధతికూడ పరీక్షింపబడుతుండేది.

ఈ నోఆఖాలీ యజ్ఞమప్పుడు, 'బాపు' హృదయ మెంత దుఃఖ భరితంగా ఉండేదో ఆ స్థితి ఈ క్రింద నీయబడిన ఉత్తరం వల్ల తెలుస్తుంది.

"ఇక్కడి పనిని నే నెట్లు పూర్తి చేయగలను? ఎటు చూస్తే అటు అగ్ని అంటుకొని ఉంది. భగవత్కృపవల్ల నే నా పని సాగిపోతున్నది. నా సత్యం, అహింస అతి సున్నిత మైన త్రాసులో తూచబడుతున్నాయి. ఆ త్రాసులో ముత్యాల మాటేమిటి, తలవెంట్రుకలో నూరవ భాగం ఉంచినా బరువు స్పష్టంగా కనిపించగలదు. బహు కఠిన పరీక్ష. నాల్గువైపుల అసత్యం తాండవమాడుచున్నది. నలుసంత విషయం బ్రహ్మాండ మంత పెద్దదిగా చేయబడి చెప్పబడుచున్నది. ఎక్కడ వెదకినా సత్యం కనబడదు. అహింస పేరిట హింస, ధర్మం పేర అధర్మం జరుగుతున్నది. అయితే నా అహింసకు, సత్యానికి ఇది పరీక్షా సమయంగాదా? పరీక్ష నియ్యటానికే నే నిక్కడ తిష్ఠ వేశాను."

ఈ మహాభారాన్ని వహించటానికి నోఆఖాలీలో ప్రతి రోజు రాత్రి రెండుగంటలకు 'బాపు' నిద్రలేచేవాడు. నన్ను కూడ లేపేవాడు. అమితంగా ఉన్న చలిలో ఇంత త్వరగా పక్క మీదనుండి లేవటానికి స్వాభావికంగా నేను ఆయాస పడేదానిని. కాని 'బాపు' ఎప్పుడు ఆయాస పడేవాడుకాడు.

ఒక రోజున వేళాకోళంగా నేను—“ బాపు ! నేటి రాత్రి గడి యారం చూడటంలో పొరపాటు జరిగినా, మీ నిద్ర ఆల స్యంగా విడినా నేను భగవంతునికి కొబ్బరికాయ కొట్టుతాను ” అని అన్నాను.

బాపు నవ్వేశాడు—తర్వాత—“ భగవంతుడేమన్నా నీ వంటి లోభి అనుకొన్నావా ? ” అని అన్నాడు. అదే జరి గిందికూడ భగవంతునికి నా కొబ్బరికాయ అవసరం లేదేమో అన్నట్లు ! మరునాడు రెండు గంటలకు, మృదువుగా నా తల పై కొట్టుతూ—“ మనూడీ ! లేవవా ? చూడు భగవం తుడికి నీ కొబ్బరికాయయందు లోభం లేకపోయింది ” అని పల్కి నన్ను లాంతరు వెలిగించమన్నాడు.

రాత్రి పడుకొనేటప్పుడు ‘ బాపు ’ లాంతరు ఆర్పించే వాడు. దాని మీద—“ ఏఁ ‘ బాపూ ’ మనం రాత్రి పద కొండు గంటలకు నిద్రపోయి రెండు గంటలకే లేస్తాము. అటువంటప్పుడు లాంతరువత్తిని బహు చిన్నదిగా తగ్గించి ఉంచితే నష్టమేముంది ? ” అని నేను ప్రశ్నించాను. ‘బాపు’— “ నీమాట బాగానే ఉంది. కాని నాకింత కిరసనాయిలు ఎవడిస్తాడు ? నీవా సంపాదించటం లేదు. నేనుకూడ అంతే. ఆఁ ! నీ తండ్రి ‘ మహువా ’లో గణిస్తున్నాడు కదా ? అందు చేత నీ కట్టి ఆలోచనలు పుట్టవచ్చు. కాని లాంతరు ఆర్పించ

టంవల్ల నాకు రెండు పనులు నెరవేరుతున్నాయి. మరలదానిని వెలిగించటంలో నీ నిద్ర ఎగిరిపోతుంది. ఏమైనా నీచేత నేను వ్రాయించ దలచుకొంటే కునికిపాట్లు పడకుండా నీవు వ్రాయ గలుగుతావు. కిరసనాయిలుకూడా ఖర్చు కాకుండా ఉంటుంది. 'ఏకక్రియాద్వ్యర్థకరీ'—అవుతుంది. (ఏక్ పంథ్, దో కాజ్)."

"ఏకక్రియాద్వ్యర్థకరీ అన్న లోకోక్తికి అర్థం ఎరుగుదువా?" అని నన్ను అడిగినాడు. నేను మామూలు అర్థం చెప్పివేశాను. కాని 'బాపు' దానికి వేరే అర్థం చూపించాడు. "దేనివల్ల మనకు సదా రెండు పనులు నెరవేరుతాయో అట్టి క్రియ ఏది? రెండు పనులంటే సరిగా రెండు పనులే అనుకోవద్దు. రెండు పనులంటే అనేక పనులన్నమాట. నూరు పనులైనా కావచ్చు. అందుచేత మనం ఎటువంటి క్రియ చేయవలెనంటే దానివల్ల అనేకపనులు సమకూరాలి. ఇక్కడ నోఆఖాలీలో వేలకొలది మనుష్యులు నాశనమైపోయారు. అందుచేత మనం ఒక్క నిమిషమైనా వృథా చేయరాదని నాకు అనిపిస్తున్నది. శరీరానికి అవసరమైనంత నిద్రపోవాలి. అవసరమైనంతే భుజించాలి. మనం అన్నిటిని సీమితం చేసుకోవాలి. ఎందుకంటే భజనలో చెప్పినట్లు మనం ఈ క్షణంనుండి లాభం పొందాలి. రేపు ఏమి కానున్నదో ముందు ఎవ్వరికి తెలుస్తుంది? (ఆజ్ నో లహా లోలీజియేరే, కాల్ కో జోదీ

తీచే) ఈ వేళప్పుడు—రాత్రి రెండు గంటలకు—ఈ సంగతులు
నీకు నేను బోధిస్తున్నాను. ఈశ్వరుడు తీసికొని పోదలచు
కుంటే నిన్నో, నన్నో ఈ క్షణంలో తీసికొనిపోగలడు. ఇది
ఈశ్వరుడు తన చేతిలోనే ఉంచుకొన్నాడు. అందుకనే ఈ
లోకోక్తి మనం బాగా మననం చేసికొన తగింది.

"అయితే దేనివల్ల అనేక కార్యాలు ఏక మాత్రంగా
సాధించగలమో అట్టిది, కల్యాణ ప్రదమైనది, బంగారం
లాంటిది—పనిఏది? అది ఒక్కటే. అదే పరోపకారం.
పరోపకారమంటే పొరుగువారి సేవ. ఈశ్వర భక్తి అంటే
కూడ అదే. జపమాల త్రిప్పటం, తిలకధారణం భక్తికాదు.
తిలకం ధరించి మనం బాకులతో మనుష్యులను పొడుస్తూ తిరు
గుతుంటే అది మోసం క్రిందికి వస్తుంది. నరసింహా మెహాతా
(గుజరాతీ భక్తుడు) చెప్పినట్లు భక్తి అంటే ఆత్మార్పణమన్న
మాట. ఈ భక్తి, లేక పరోపకారం శరీరంతో నీవు చేయ
లేకపోతే మనస్సుతోనైనా చేయాలి. లేచేటప్పుడు, కూర్చు
నేటప్పుడు, త్రాగేటప్పుడు, తినేటప్పుడు, ఆడేటప్పుడు, పాడే
టప్పుడు, ఎగిరేటప్పుడు, తిరిగేటప్పుడు, మనస్సుద్వారా
జగత్కల్యాణాన్ని కాంక్షించుతూ ఉండాలి. పైగా మన
చేతికి సేవాకార్యం ఏది వస్తే దాన్ని చేస్తూ ఉండాలి. నీవు
ఇంతమాత్రం మనస్సుకు పట్టించుకొంటే చాలా నేర్చుకొన్నా

వన్నమాట. మన లోకోక్తులు అంత గూఢార్థాలతో నిండి ఉన్నాయి. చూడు! కిరిసనాయిలుకు సంబంధించిన ఒక చిన్న వేళాకోళపు మాట పట్టుకొని నీ కొక గొప్పపాఠం నేర్పేశాను."

ఆ మహాగురువు, ఆ గంభీరోపదేశాన్ని రాత్రి రెండు గంటలకు, ప్రశాంతమైన గంభీర నిశీథమందు, బహు మంద స్వరమున ఇరువది నిమిషాలు చేశాడు. అంత మెల్లగా మాట్లాడునప్పుడు కూడ తన మాటలవల్ల ఇంకొకరికి నిద్రా భంగం కాకూడదన్న మాట ఆయన మరచిపోలేదు.

## ౧౨. 'ఏకలో జానేరే'

నోఆఖాలీలో గుడిసెలు మట్టితోను కొబ్బరి ఆకుల తోను కట్టుకుంటారు. మంచిఇండ్లు చాలా తక్కువ. ఉన్న కొద్దివి హత్యాకాండ జరుగుతున్న రోజులలో తగులబెట్ట బడినవి.

'బాపు' ముఖ్యనివాస స్థానం శ్రీరామపురంలో ఉండేది. అక్కడ మేము ఉంటున్న ఇల్లుకూడా మట్టిదే. పైకప్పు ఆకులది. రైతులవి అట్టి గుడిసెలే మా గుజరాతులో కూడ కనబడుతూ ఉంటాయి. కాని శ్రీరామపురంలోని గుడిసెలలో ఉండటానికి వీలుగ ఎన్నో మార్పులు అక్కడి స్నేహితులు

చేశారు. 'బాపు' కాలినడకను యాత్ర చేయటానికి నిశ్చ యించుకొన్నప్పుడు—అందరికి చింత మొదలైంది. ఎందు కంటే 'బాపు' ఒక్కొక్క రోజు ఒక్కొక్క క్రొత్త గ్రామంలో గడపవలసి వస్తుంది. దానికి తోడు గ్రామాలలోని గుడిసెలు ఎన్నోతగుల బెట్టబడినాయి. అక్కడి గాలికూడా చాలా నెమ్ముగా ఉంటుంది. వాన మొదలైతే మూసలధారే. అట్టి స్థితిలో చెట్లక్రిందకూడ ఉండటం ఎట్లాగు? 'బాపు' ఎక్కడ ఉండాలన్న చింత అందరిని బాధించసాగింది. సతీశ బాబుకు అందరికంటె ఎక్కువ చింత ఉండేది. ఏలన యాత్రకు వలయు ఏర్పాట్లన్నీ చేయవలసిన భారం ఆయనది. కాని ఆయనైతే విద్వాంసుడు, బుద్ధిశాలి. మడిచి వెంటతీసికొని పోవటానికి వీలైన గుడిసె నొకదానిని ఉపాయంగా త్వరలో ఆయన తయారు చేయించాడు. అందులో కిటికీలు, ద్వారాలు, 'బాపు', నేను పడుకొనేందుకు బరువులేని మంచాలు రెండు, నేల ఎత్తు పల్లములుగా ఉన్నా కష్టం కలుగకుండా ఉండేందుకు నేలమీాద పరచటానికి గడ్డి, చాప మున్నగు సదుపాయాలన్నీ ఉన్నాయి. దానిలో, స్నానం చేయటానికి వెనుక ఒకగది కూడా ఉంది. అంతటి కళామయమైన వస్తువును ఆయన సిద్ధం చేయించాడు. ఒక మడత గుడిసెను సతీశబాబు తయారు చేయిస్తున్నాడన్న సంగతి మాత్రం 'బాపు' నకు తెలియును.

కాని, దానిని చూస్తే 'మహాలు వంటి గుడిసె' అని అన వలసి వచ్చేటంత బాగా ఉంటుందని ఆయనకు తెలియనే తెలియదు.

'బాపు' శ్రీరామపురంలో ఉండేవాడు. కాని ఆయన యాత్ర చండీపురం నుండి మొదలైంది. అది శ్రీరామపురా నికి రెండు మైళ్ల దూరంలో ఉంది. ఎక్కువ నష్టానికి గురియైన గ్రామం చండీపురంనుండి కొంచం దగ్గరగా ఉండటమే దీనికి కారణం. యాత్రను శ్రీరామపురంనుండి మొదలు పెట్టి ఉంటే ఒక్క దినంలో 'బాపు' నకు ఎకాయకి ఏడెనిమిది మైళ్లు నడవ వలసి ఉండేది. అది ఆయనకు చాలా కష్టమయ్యేది. అందు కని చండీపురంలో ఒక రాత్రి గడపిన తర్వాత ముందునకు సాగినాము. చండీపురంలోకూడ కొద్దోగొప్పో నష్టం జరిగింది.

నిజమైన నోఆఖాలీ యాత్ర 'బాపు' నకు చండీపురం నుండియే ప్రారంభమైంది. ఆనాడు యాత్రకు బయలుదేరే ముందు సోదరీమణులనేక మంది 'బాపు'నకు కుంకుమ బొట్టు పెట్టినారు. అందరంకలిసి ప్రార్థన చేశాము. ఆ రోజు 'వైష్ణవ జనతో తేనే కహిాప' అన్న భజన కీర్తన పాడవల సిందని 'బాపు' నాకు సూచించాడు. (ఈ పాటను ఏదైనా ప్రత్యేక సందర్భాలలో తప్ప రోజూ పాడేవారము కాము.) కాని, ప్రతి చరణం తర్వాత పల్లవి పాడవలసి వచ్చినప్పుడు

వరుసగా 'వైష్ణవ జన'కు బదులుగా ఒక్కొక్క సారి 'ముస్లిం జన', 'క్రైస్తవ జన' 'శిఖ్ఖు జన', 'పార్శీ జన', 'హరినా జన' ఉంచి పాడమన్నాడు. ఆయన స్వయంగాకూడ పాట పాడటంలో గొంతు కలిపేవాడు.

చండీపురంనుండి 'బాపు' చెప్పులు తొడుగుకొనుట కూడా మానివేశాడు. దానికి కారణంగా—"మనం దేవాలయంలోనకి, మసీదులోనికి వెళ్లేముందు చెప్పులు వదలి వేస్తాము. అంటే పవిత్ర స్థలాలలో మనం చెప్పులు తొడుగుకొని నడవమన్న మాట. నేనైతే దరిద్ర నారాయణుని వద్దకు పోతున్నాను. ఎవరికుటుంబములోని వారు, బంధువులు దోచుకొన బడినారో; ఎవరి స్త్రీలు, పిల్లలు హత్యచేయబడినారో; ఎవరి వద్ద సిగ్గుదాచుకొనటానికైనా సరిగా బట్టలేదో అట్టి వారుండే నేలమీాద నడిచి వారిని నేను కలుసుకోవలసి ఉంది. నాకైతే ఇది పరమ పవిత్రమైన యాత్ర. ఇందులో చెప్పులు తొడుగుకొనుట ఎట్లా ?" అన్నాడు. ఈ మాటలు చెప్పేటప్పుడు, వెన్నకొరకు చిలుకబడే మజ్జిగవలె 'బాపు' హృదయం మంథనకు లోనగుచుండింది. ఆయన మాటలలోగల కరుణధ్వని ఈనాడుకూడా నా చెవిలో గింగురుమని మారు మ్రోగుచున్నది.

'బాపు' అరికాళ్లు మన అరచేతులకంటె కూడా

మృదువైనవి. వాటిలో ముళ్లు గ్రుచ్చుకొని, అవి పగిలి పుండ్లై బాధకూడ పెట్టినవి.

చండీపురంనుండి సరిగా ఉదయం ఏడు గంటలకు ఒక చేయి నా భుజం మీాదనుంచి, రెండవ చేతితో కర్ర పట్టుకొని, పోక తోటలలోనుండి, కొబ్బరి తోటలలోనుండి అందరి కంటె ముందు, రవీంద్ర కవీంద్రుని 'ఏకలా చలో' అనే గీతాన్ని పాడుతూ 'బాపు' తన యాత్రను ప్రారంభించాడు.

జది తోర్ డాక్ శునే కేఓనా ఆసే
తబే ఏకలా చలోరే!
ఏకలాచలో, ఏకలాచలో,
ఏకలా చలో రే! ॥ జది ॥

జదికే ఓ కథా న కయ్,
ఓరే ఓరే ఓ అభాగా,
కేఓ కథా న కయ్,
జది సబా ఈ థాకే ముఖ ఫిరాయే
సబా ఈ కరే భయ్;
తబే పరాణ్ ఖులే,
ఓతు ఇ ముఖఫుటే తోర్ మనేర్ కథా
ఏకలా బలోరే! ॥ జది ॥

జది సబాఈ ఫిరే జాయ్,
ఓరే ఓరే ఓ అభాగా,
సబాఈ ఫిరే జాయ్.
జది గహన పథే జవార్ కాలే
కేఓ ఫిరే నా చాయ్;
తచే పథేర్-కాంటా,
ఓ తుఇ రక్త-మాఖా చరణ తలే
ఏకలా దలోరే! ॥ జది ॥
జది ఆలో నా ధరే,
ఓరే ఓరే ఓ అభాగా,
ఆలో నా ధరే;
జది ఝుడ-బాదలే అంధార్ రాతే
దుఆర్ దేయ్ ధరే;
తబే బజ్రానలే,
ఆపన్ బుకేర్ పాంజర్ జాలియే నియే,
ఏకలా జలోరే! ॥ జది ॥

బంగాలీపాట కర్థం:
కేకలువేసి పిలిచినా ఎవ్వరు రాకపోతే నీవు
ఒంటిగనే ముందునకు సాగిపో.
అంతా నోరువిప్పుటకు కూడ భయపడి వణుకుతూ
పడిఉంటే, ఓ నిర్భాగ్యుడా!
నిర్భయంగా నీ వొక్కడివే నోరుతెరచి
నీ మనస్సులో నున్నది గట్టిగా చెప్పు.

దుర్గమ పథమును దాటవలసి వచ్చినప్పుడు అందరూ
నిన్ను వదలి వెనుదిరిగిపోతే, ఓ నిర్భాగ్యుడా!
ఆ కంటకాకీర్ణ పథమును రక్తరేఖాంకిత మొనర్చుచు
ఒంటరిగానే సాగిపొమ్ము.

మేఘావృతమును అంధకారబంధురమునైన కాళరాత్రిని
నీ కెవ్వరు దీపముతో దారి చూపించకున్నను ఓ నిర్భాగ్యుడా!
వజ్రానలముతో నీ హృదయాగ్ని రగుల్చుకొని
దానితో నీ హృదయము నొక్కదానినే దహించుకొని పోనిమ్ము.

అనుదినం యాత్ర ప్రారంభ మయ్యే ముందు ఈ బెంగాలీపాట పాడే వాళ్లము. తర్వాత ఒకదానితర్వాత ఇంకొకటి చొప్పున, దారిపొడుగునా భజనకీర్తనలు పాడుతూ, రామనామస్మరణ చేస్తూ వెళ్లుచుండేవారము. దారిలో, ఎక్కడెక్కడ హత్యలు జరిగినాయో, ఎక్కడెక్కడ ఎముకలు పడి ఉండేవో, ఎక్కడెక్కడ తగులబెట్టబడిన గుడిసెలుండేవో, అక్కడక్కడ 'బాపు' ఆగి వాటిని చూస్తూ ముందుకు సాగి పోయేవాడు. వాటినన్నిటినీ చూస్తూంటే ఆయన హృదయం వ్యథచే కుమిలిపోతూ ఉండేది. అట్టియెడ భజనవల్లనే ఆయనకు మనఃశాంతి దొరికేది.

ప్రొద్దున్న ఏడున్నర గంటలకు బయలుదేరిన మేము మాసీపురం తొమ్మిదిన్నరకు చేరినాము. అక్కడ తక్కిన

అన్నిచోట్లకంటె ఎక్కువ నష్టమైంది. అది 1947 జనవరి 7వ తేదీ. అక్కడ 'బాపు' దిగటానికి తగిన స్థలం ఒక్కటికూడా లేదు. అందుకని సతీశబాబు ఇచ్చిన 'సంచార కుటీరం' నిలవబెట్టబడింది. దానిలోనికి పోయి మూలమూలలు 'బాపు' అతి సూక్ష్మంగా పరీక్షించాడు. పిమ్మట బల్లమీద కూర్చొని కాళ్లు కడిగించుకొంటూ నాతో—"చూశావా! సతీశబాబు నా 'మహాలు' కొరకు ఎంత శ్రమపడినాడో! దానిని మోసే వారికి కష్టం ఏమాత్రం లేకుండా ఉండాలన్న ఉద్దేశంతో దానిని ఎన్ని చిన్నచిన్న భాగాలుగా విభజించాడో! ఒక్కొక్క భాగాన్ని చిన్న పిల్లవాడుకూడా మోసుకొని పోగలడు. నా మీద ఎంతప్రేమ కురిపించినాడో ఆయన! ఇంత మహాప్రేమను నే నెట్లు ఒక్కడనే ఉపయోగించుకో గలను? అందుచేత ఈ మహాలును మనం ఇక్కడనుండి ఇంకొకచోటికి తీసికొని పోరాదని నేను నిశ్చయించాను. ఇక్క డనే ఉంచి దానినొక వైద్యశాలగా చేద్దాము. లేదా అటు వంటిదే ఇంకొకపనికి ఉపయోగించుదాము. ఎక్కడ స్థలం దొరికినా నే నక్కడ సుఖంగా ఉండగలను. ఒకవేళ ఎక్కడా స్థలం దొరకకపోతే చెట్లు ఉండనే ఉన్నాయి గదా? 'మాక్రింద ఉండవద్దని' అవి మనలను అడ్డుపెట్టవు కదా? వాటి నీడనే సుఖంగా పడిఉందాము. ఎట్లా ఉంచ దలచుకొంటే అట్లా

ఉంచుతాడు రాముడు. దాని చింత మనకెందుకు ? గ్రామాలకు వెళ్లిన కార్యకర్తలను ఆయా గ్రామాలవారు తమ కుటుంబంలోని వ్యక్తులను పోషించుకొనేటట్లే పోషించాలని నేను సూచించాను. కార్యకర్తలుకూడా ఆయా కుటుంబాలకు చెందిన మనుష్యులై పోవాలి. "మేము గొప్పవాళ్లము" అనిగాని, లేక "మీ సేవచేయుటకు వచ్చాము, అందుచేత మీకు మహోపకారం చేస్తున్నాము" అన్నట్టి భావంతో గాని వారు గ్రామాలలో మెలగరాదు. అట్లు ప్రవర్తించేటట్లయితే అక్కడ వారు చాలాకాలం ఉండ జాలరు. జబ్బుపడితే, అదే గ్రామంలోని వైద్యులనుండి వారు మందు పుచ్చుకోవాలి. వైద్యుడెవ్వడూ దొరకకపోతే ప్రకృతిలోగల పంచభూతములనుండి ఏది దొరుకుతుందో దానితోనే వారు సంతోషపడాలి. ఇదే నియమం నేను నా కొరకు కూడా పెట్టుకొన్నాను," అని అన్నాడు.

మరునాడు ఆ సంచార కుటీరాన్ని 'బాపు' వెంట తీసికొని రానియ్యలేదు. మేము ఏ గ్రామం చేరితే అదే గ్రామంలోని ఏదో ఒక గుడిసెలో ఉండేవాళ్లము. అందుచేత హిందూ, ముసల్మానుల ఇండ్లలోను, సాలె, కుమ్మరి, హరిజన్, మంగలి, రైతు, బ్రాహ్మణ, వైశ్య, కమ్మరి, మొదలుగాగల అన్నిజాతులవారి ఇండ్లలోను ఉండే అవకాశం మాకు లభిం

-చింది. నోఆఖాలీ హత్యాకాండలో భాగం తీసుకొన్నట్టివారు కూడ ఎంతోమంది మేము బసచేసిన వాళ్లలో ఉన్నారు. దీని వల్ల వారికి హృదయ పరివర్తనం కలిగింది. అదిగాక 'బాపు' వారి ఇండ్లలో బసచేసినందువల్ల, ఈ లోకంలోనే తమ పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకొనే అవకాశం దొరికిందని వారు భావించుకొనసాగిరి. ఈ విధంగా అందరూ తమ గృహాలను, తమ జీవితాలను పవిత్రం చేసికొన మొదలుపెట్టినారు. ప్రజల ఇండ్లలో దిగి, వారితో కలిసిమెలసి పోవుటకు తనకు దొరకిన సౌభాగ్యంవల్ల—ఇన్ని కష్టాలలోకూడ 'బాపు' తన జీవితం ధన్యమైందనుకొనసాగినాడు. ఇంత దుఃఖములోకూడ ఆయన మొగమున ఆనందం వెల్లివిరిసేది.

"నోఆఖాలీలో హత్యాకాండ జరుగుటయే మంచిదైంది. దానివల్ల మా ప్రాంతం 'బాపు' చరణస్పర్శ గాంచే భాగ్యం పొంది పవిత్రమైంది," అని ఎంతో మంది అనుకొనేవారు.

•

## ౧౩. పూలదండలతో స్వాగతం

ఒకసారి దేవీపురం (నోఆఖాలీలో ఒక గ్రామం) గ్రామవాసులు, కార్యకర్తలు 'బాపు' నకు స్వాగతం ఇచ్చేందుకు చాలా ఆడంబరంతో పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేశారు.

అందు కొరకు దాదాపు నూటయాభై లేక రెండువందల రూపాయలు ఖర్చు చేశారట (ఇది మాకు తర్వాత తెలిసింది). ప్రతి రోజు 'బాపు' ఏ గ్రామం చేరుకుంటాడో ఆ గ్రామంలోని స్త్రీలు ఆయనకు తిలకం బెట్టి స్వాగత మొసంగే వారు. మహా అయితే కొబ్బరి ఆకులతో వేర్వేరు రీతుల గ్రామాన్ని అలంకరించే వారు. అట్లు చేస్తే 'బాపు' ఏమీ అభ్యంతరం చెప్పేవాడు కాడు. ఎందుకన్న అట్లు చేయటానికి శరీరశ్రమ తప్ప డబ్బుఖర్చు చేయవలసిన అవసరం పట్టదు. కాయకష్టంతో ఏమి చేసినా 'బాపు' అడ్డు పెట్టేవాడు కాడు.

కాని దేవీపురం ప్రజలు చాందపురం నుండి ప్రత్యేకంగా, రంగురంగు కాగితాలు, పట్టు దారాలు, పువ్వులు మున్నగు వాటిని కొని తీసుకొనివచ్చి వాటితో గ్రామాన్ని అలంకరించారు. ఇదే గాక నేతితోను, నూనెతోను దీపాలు పెట్టినారు.

ఈ అలంకరణమంతా చూసి 'బాపు' కొంతసేపు గంభీరుడై పోయాడు. పిమ్మట, అక్కడ స్థిర నివాసం చేసికొని ఉన్న కార్యకర్తలెవరో, ఆ గ్రామ జనసంఖ్య ఎంతో మొదలగు విషయాలు తెలిసికొన వలసిందని నాకు జెప్పినాడు. విచారించి, ఆ గ్రామంలో మూడువందలమంది హిందువులు, నూటయాభై మంది ముసల్మానులు ఉన్నారని; హిందువులలో

బ్రాహ్మణులు, కాయస్థులు, శూద్రులు గలరని నేను ‘ బాపు ’ నకు తెలియ జేశాను.

అంతట ‘ బాపు ’ అక్కడ ఉండే ముఖ్య కార్యకర్తను పిలిచి కోపంతో—“ ఈ అలంకారం కొరకు డబ్బు మీరు ఎక్కడ నుండి తెచ్చారు ” అని అడిగినాడు. ఆ సోదరుడు—“ మీ చరణ స్పర్శ మా భూమికి మాటి మాటి కెట్లు లభ్యం కాగలదు ? అందుకని హిందువులం మేము ఒక్కొక్కరం ఎనిమిది అణాల చొప్పున చందా వేసుకొన్నాము. అంత కంటె అధికంగా ఇయ్య గల్గిన వారు అధికంగా కూడ ఇచ్చారు. ఈ విధంగా దాదాపు మూడు వందల రూపాయలు ప్రోగు చేసి ఈ వస్తువులన్నింటిని కొని తెచ్చినాము ” అని జవాబిచ్చాడు.

దీనితో ‘ బాపు ’ నకు ఇంకా కోపం వచ్చి “ మీరు చేసిన ఈ అలంకారమంతా క్షణంలో కాంతి విహీనమై పోతుంది. ఇది చూస్తే మీరు నన్ను మోసం చేస్తున్నట్లని పించుతున్నది. పైగా నా అండ చూసుకొని ఈ వ్యర్థాడం బరంతో మత వైషమ్యాలను వృద్ధి చేస్తున్నారు. నలువైపుల నాలుకలు చాచుకొని పైకెగసి వస్తున్న అగ్ని జ్వాలల మధ్య నే నిప్పుడున్నానని మీకు తెలియదా ? ఈ పూలదండలు ఎన్ని వేశారో వాటికి బదులు అన్ని నూలు దండలు నాకు

వేస్తే నాకు దుఃఖము కలిగేది కాదు. ఆ నూలు దండలు అలంకారంగానే ఉండక, తర్వాత బట్టలుగా నేయించుటకు పనికి వస్తాయి. వ్యర్థంగా పోవు. ఈ గ్రామంలో చాలా డబ్బుందను కొంటాను. లేకపోతే ఇట్టి సంకట సమయంలో ఈ హారాలు, తోరణాలు తయారు చేయాలని మీకు తోచి ఉండేది కాదు. నాయందు మీకు గల ప్రేమ చూపించుటకు కూడా ఇదంతా చేస్తే అది కూడా తప్పే. దీనివల్ల మీ ప్రేమ ఎంత మాత్రం ప్రకటితం కాదు. మీకు నా యందు ప్రేమ ఉంటే నేను చెప్పేది చేస్తే చాలు, అంత మాత్రం చాలు నాకు. ఇన్ని హత్యాకాండలు జరిగిన పిమ్మట వ్యర్థంగా ఇంత డబ్బు ఖర్చు చేయాలనే బుద్ధి మీకు ఎట్లా పుట్టిందో నా కర్థం కావటం లేదు. నీవో, పేరు పొందిన కాంగ్రెసు కార్యకర్తవు. నా పుస్తకాలు కూడా చదివినానంటున్నావు. ఎం. ఎ., వరకు చదువు చదివినావు. జైలుకు కూడా పోయి వచ్చావు. ఖద్దరు అంగ వస్త్రం కూడా కట్టుకొంటున్నావు. అయితే ఈ అలంకరణలో విదేశ మిల్లులనుండి వచ్చిన పట్టుదారం, రిబ్బనులు మొదలైనవి ఎట్లా ఉపయోగించావు? నే నింత చెప్పదలచుకొన్నాను. నా దృష్టిలో ఇదంతా దుఃఖ దాయకంగా ఉంది. ఒక నాడు ప్రజా సేవకులుగా ప్రసిద్ధి కెక్కిన కార్యకర్తలు—అధికారంలోకి వస్తే పూలహారాలు వేసే లేక వేయించుకొనే లోభంతో

భ్రష్టులై పోతా రేమోనని నాకు అనుమానంగా ఉంది. 'నా కార్యకర్తలలో ఎవరినైనా సరే పరీక్ష చేయండి. అతను ఎంత పవిత్ర జీవియో మీకు తెలుస్తుంది. అతనివద్ద ఎన్ని మోటారు కారులు, బంగళాలు ఉన్నా తన ధ్యేయాన్ని మాత్రం వదలి పెట్టడు' అని ధైర్యంతో తల యెత్తుకొని గట్టిగా నేను ఈ నాడు కూడ చెప్ప జాలననిపిస్తున్నది. సరే జరిగిందేదో జరిగింది. మంచిమాట. ఈ నాటి కథ వల్ల నా కండ్లు తెరచు కొన్నాయి. నేను జాగరూకుడనైనాను. ఇందులో మీ దోషం ఉందనను. మీరు మీ అసలు స్వరూపంలో కనబడి నారు. దానికి ఎవరు ఏమి చేయగలరు? ఇది మిషగా నే నెక్కడున్నానో ఈశ్వరుడు నాకు గుర్తుకు తెచ్చినాడు. విధి ఇంకా ఏమేమి చూడాలని వ్రాశాడో!" అని అన్నాడు.

'బాపు' నకు ఇంత దుఃఖం కలుగుతుందని పాపం ఆ కార్యకర్తలకు ఏమి తెలుసు? ఆ సోదరులు చిన్న బుచ్చు కొన్న ముఖములతో అక్కడ నుండి వెళ్లి పోయారు. అరగం టలో ఆ అలంకారమంతా లాగివేయబడింది. పనికి వచ్చే వస్తువులు జాగ్రత్త పెట్ట బడినాయి. పూలహారాల కొరకు ఉపయోగించిన దార మంతా ఒక ఉండగా చేయ వలసిందని 'బాపు' చెప్పినాడు. అది చాలా పెద్ద ఉండయింది. బట్టలు కుట్టుకొనుటకై దానిని ఇచ్చాడు. దానిలో దాదాపు పది

హేను, ఇరవై రీలుల దారం ఉంది. 'బాపు' అంత కోవ పడక పోతే అంత దారం వృథాగా పోయి ఉండేది కదా ? ఆ తర్వాత గ్రామాల వారు చేతితో వడికిన నూలు దండలు వేసి 'బాపు' నకు స్వాగత మిచ్చేవారు. దాని వల్ల అయిదు తానుల బట్టకు సరిపోయేటంత నూలు ప్రోగైంది. దానితో బట్ట నేయించబడి బీదవారలకు పంచి పెట్ట బడింది. నిజంగా 'బాపు' బీదవారల కాపుడే !

## ౧౪. కలకత్తాలో జరిగిన అద్భుతం

క్రిందటి సంవత్సరం 1947లో, ఎన్నో ఏండ్ల బానిసత్వం తర్వాత స్వాతంత్ర్యదినం రాబోవుచున్నప్పుడు 'బాపు'తో పాటు మేము కలకత్తాలో ఉన్నాము.

ఆగస్టు 15వ తేదీనాడు మరల నోఆఖాలీలో ఎక్కడైనా నిప్పు అంటు కొంటుందేమో అన్న భయం హిందువులను పట్టుకొని ఉంది. అందుకనే అక్కడికి వెళ్లటానికి కాశ్మీరునుండి 'బాపు' కలకత్తా చేరుకొన్నాడు.

అప్పుడు కలకత్తాలో హిందూ ముస్లిం కొట్లాటలు జరుగుతున్నాయి. అందుకని అప్పటి బెంగాలు ప్రధాన మంత్రి బాబు ప్రఫుల్లచంద్రఘోషు రెండు రోజులు ఆగమని 'బాపు' ను ప్రార్థించాడు. 'బాపు' ఆగిపోయాడు. కొట్లాటలు

ఎక్కువ కాసాగినవి. అయినప్పటికి 'బాపు' ఆగస్టు 15వ తేదీకి నోఆఖాలీ చేరాలని నిశ్చయించుకొన్నాడు. మే మంతా సిద్ధం కూడా అయినాము. ఇంతలో శహీద్ సుహరావర్ది సాహెబ్ వచ్చి—"ఇక్కడ మండుతున్న అగ్నిని మీరు తక్క ఇం కెవ్వరు ఆర్ప లేరు. దీనిని ఆర్పి వేసిన తర్వాతనే మీరు నోఆఖాలీ వెళ్లండి," అని అనసాగినాడు. దానికి 'బాపు'— "నేను ఒక్కడినే ఎట్లు ఆర్పగల్గుతాను? ఆఁ! నేను మీకు మంత్రిగా పని చేయగలను. కాని నే నైతే నోఆఖాలీ తిరిగి వస్తానని మాట ఇచ్చి వచ్చాను. అందుకని నే నక్కడికి వెళ్ల వలసి ఉంటుంది. అయితే మీరు నోఆఖాలీ బాధ్యత వహించితే నే నిక్కడ ఉండి ఈ అగ్నిని ఆర్పేందుకు చేతనైనంత ప్రయత్నం చేయటానికి సిద్ధం. కాని, ఒక్క మాట. నాతో కలిసి ఉండటానికి, ఫకీరుగా మారటానికి మీరు ఒప్పుకోవలసి ఉంటుంది," అన్ని చెప్పినాడు.

సుహరావర్ది కొంచెంసేపు ఆలోచించి—"నే నక్కడికి మనుష్యుల పంపి చేతనైనంతవరకు ప్రయత్నిస్తాను" అని అన్నాడు.

'బాపు' తక్షణమే—"చేతనైనంత ప్రయత్నం చేస్తాననటంతో సరిపోదు. బీహారులో ఏమైనా గడబిడ జరిగితే నేను ఉపవాసం చేస్తానని బీహారు వాళ్లతో చెప్పి వచ్చాను.

నోఆఖాలీలోకూడ ఏదైనా అల్లరి జరిగితే అదే విధంగా నేను ఉపవాసం చేస్తానన్నమాట. ఆ మాట జ్ఞాపకం ఉంచుకొని మీరు జవాబియ్యండి" అని అన్నాడు. ఈ మాటలు ఆగస్టు 13వ తేదీన జరిగినవి.

'బాపు' వ్యవహారపద్ధతి అట్టిది. నోఆఖాలీలో నేటి వరకు జరిగిన హత్యాకాండకు, ముందు ఏమైనా జరిగితే దానికి నోఆఖాలీవారే బాధ్యులుగా భావించ బడతారని చెప్పటంతోడనే శహీంద్ సాహెబ్ కొంచం ఆలోచనలో పడి పోయాడు. నిజం చెప్పవలసివస్తే ఆయనకు నోఆఖాలీ బాధ్యత తీసికొనుట ఏమంత భారమైన పనికాదు. నోఆఖాలీ హత్యా కాండకు బాధ్యులైనట్టి, ఘోరనేరారోపణలు చేయపడినట్టి ముసల్మాను సోదరులందరు విముక్తులైనారు. పైగా వారంతా శహీంద్ సాహెబ్ మాట వినేవారే. తన కార్యసాధనకొరకు 'బాపు' అవలంబించిన పద్ధతి ఎట్లున్నది? బాధలుపెట్టిన వాడినెత్తిని సంరక్షణ భారం పెట్టటమా! ఎవడైనా నౌకరు ఇంట్లోనుండి కొద్దికొద్దిగా దొంగతనం చేస్తూఉంటే 'అంతా నీవేచూడ' మని కష్టాలకు పూర్తిగా సిద్ధపడి ఇల్లు ఆ నౌకరు మీద వదలివేసే మనిషివంటి వాడు 'బాపు'. ఇట్టి పద్ధతుల వల్లనే మనదేశం ఇట్టి ఉన్నతస్థానాన్ని పొందగల్గింది.

రెండవ రోజున శహీంద్ సాహెబ్, ఆయన మిత్రులు

వచ్చి—"నోఆఖాలీలో పూర్తిగా శాంతి ఉండేటట్లు చూసే బాధ్యత మాది. ఇక ముందు ఏమీ జరుగకుండా చూస్తాము. మీరు మాత్రం ఇక్కడ ఉండిపోండి," అని అందరూ అన్నారు. మంచిదే. నోఆఖాలీలో 'బాపు' నకున్న పని కలకత్తాలోనే నెరవేరింది. ముసల్మాను సోదరులందరూ నోఆఖాలీ వెళ్లినారు. అక్కడి హిందువులకు ధైర్యం కలుగ జేశారు. వారికి పూర్తిగా తోడ్పడటానికి కూడా అంగీకరించారు. ఇక్కడ సుహారావర్ది సాహెబ్ 'బాపు' తో ఉండేందుకు ఒప్పుకొన్నాడు. ఆఖరికి తిండితినుట, నీళ్లు త్రాగుట, లేచుట, కూర్చొనుట అన్నిపనులు 'బాపు' తోనే. ఇద్దరిలో ఏవ్వరూ ఒంటరిగా ఎవ్వరిని కలవకూడదని, పత్రికలకు వ్రాయటంకూడా ఇద్దరూ కలిసే వ్రాయాలని నిశ్చయింప బడింది. ఆగస్టు 14వ తేదీకి మేము బేలియాఘాట్ లోని హైదరీ మేన్షన్‌లో ఉండటానికి వెళ్లినాము. ఈ మొహాల్లా (పేట) లోనికి ముసల్మాను సోదరులు పోజాలకుండెడి వారు.

ఇల్లు చెప్పటానికి వీలులేనంత అపరిశుభ్రంగా ఉండింది. ఇంత యిబ్బంది నోఆఖాలీ యాత్రలోకూడ లేకుండెను. ఒక్కటే ఒక్కగది. దానిలోకి 'బాపు' దర్శనార్థం వేలకొలది ప్రజలు వస్తూ ఉండేవారు. 'బాపు' నకు ఒక్క నిమిషమైనా

విశ్రాంతి దొరికేదికాదు. మేము ఆ ఇంటికి వెళ్లిననాడు ఎంతోమంది నవయువకులు 'బాపు' యెడ ఆగ్రహావేశులై — "హిందువులకు మీరు శత్రువులు. రెండు మూడు రోజులలో కొద్దిమంది ముసల్మానులు చంపబడేటప్పటికి మీరిక్కడికివచ్చి తిష్ఠవేసి కూర్చున్నారు. ఇంతవరకు ఎక్కడ ఉన్నారు?" అని అనసాగినారు. 'బాపు' చిరునవ్వు నవ్వి, అందరిని శాంతపరుస్తూ.—"మీరంతా యువకులు. నా ముందర పిల్లలు. ఇక్కడ కూర్చున్న మీ అందరికంటె నా ఆఖరికొడుకు దేవదాసుకూడా పెద్దవాడు. జన్మచేత నేను హిందువుడను. కర్మచేతకూడా నేను హిందువుడనే. హిందువుల శత్రువు నెట్లు కాగలను? ఇది మీరెందుకు అర్థం చేసుకోలేరు? నోఆఖాలీ వెళ్లింది ఎవరు? ఈనాడు నేను అక్కడికి వెళ్లేవాడినే. నాకు మీ సహాయం కావాలి. ఒక్కడినీ నేను ఏమీ చేయలేను. రక్షకులైనా, భక్షకులైనా నాకు మీరే. భక్షకులైనా సంతోషించుతాను. ముసలివాడను నేను. ఇంకా చాలాకాలం బ్రతకాలని నాకు లేదు. చాలా సేవచేశాను. వీనేటట్లయితే మిమ్ముల శాంతింప చేద్దామనే వచ్చాను. హిందూ ముసల్మాను లిద్దరికి నేను సేవకుడను. నాకు అన్ని మతాలు సమానమే. చూడండి! నోఆఖాలీలో సదా శాంతి ఉండేటట్లు నేనిక్కడ కూర్చొనే ఏర్పాట్లుచేశాను," అని పిమ్మట

శహీంద్ సాహేబ్ తనతో కలసి ఎట్లు ఉండేందుకు వచ్చాడో ఆ కథ వారికి తెలియజేశాడు.

'రక్షకులైనా మీరే—భక్షకులైనా మీరే,' అన్న ఈ వాక్యంలో 'బాపు' భవిష్యత్తున జరుగబోవునది సూచించినాడా? వాస్తవానికి, ఆయనకు భక్షకులైంది హిందువులే గదా?

యువకులంతా శాంతించారు. వీరే నగరంలోనికి పోయి శాంతి సందేశాన్ని వ్యాపింపజేయ మొదలిడినారు. స్వాతంత్ర్యం దొరకుటకు అరగంట ముందే—అనగా రాత్రి పదకొండున్నర గంటలకే హిందువు ముసల్మానును, ముసల్మాను హిందువును చూడటమే భరింపజాలని కలకత్తాలో హిందూ ముస్లిం భాఈ, భాఈ (హిందు ముసల్మానులు సోదరులు), హిందూ ముస్లిం ఏక్ హో (హిందూ ముసల్మానులు ఏకము కావాలి) అన్న నినాదములు ఆకాశాన్ని చీల్చివేయ సాగినాయి. భుజం భుజం కలుపుతూ మోటారు లారీలలో హిందూ ముసల్మానులు 'బాపు' దర్శనార్థం రాసాగినారు. రాత్రి అంతా అట్లాగే ఉండింది. రాత్రి అంతా 'బాపు' నిద్రపోవటానికి వీలులేకపోయింది. హిందూ ముసల్మాను సోదరులే కాదు, సోదరీమణులు, పిల్లలు అంతా కలిసి స్వాతంత్ర్య ప్రదాతయగు రాష్ట్రపిత దర్శనం చేసికొని—'మా అపరాధము

క్షమించు—ఇకముందెప్పుడట్లు చేయము,' అని ప్రతిజ్ఞ గైకొని పోవుచున్నారేమో అన్నట్లు వెడలిపోవుచుండేవారు. అప్పుడు అక్కడి దృశ్యమట్టిది. నగరమంతా దీపాలు పెట్టబడినాయి. సభలు, ఊరేగింపులు, ఉత్సవాలు మొదలైనవి జరిగాయి. కాని 'బాపు' అరగంటలో సాధించిన శాశ్వతమైన ఐక్యతముందు ఆ దీపాలు వెల వెల బోతున్నట్లుండేవి! ఇదిగాక నాటినుండి నేటివరకు నోఆఖాలీలో శాంతి భంగమైనదనటానికి తగిన సంఘటనేదీ జరుగలేదు. అక్కడ ప్రశాంతంగానే ఉంది. 'బాపు' అక్కడ ఉంచిన కార్యకర్తలు అప్పుడూ ఇప్పుడూకూడ అక్కడనే ఉన్నారు.

ఆగస్టు 15వ తేదీనాడు మమ్మందరిని 'బాపు' ఉపవాసం చేయమన్నాడు. అంతట నేను—"బాపూ! నేడు మాకు మీరు మిఠాయి పంచిపెట్టవలసిన రోజుకాదా?" అని అడిగినాను. 'బాపు' జవాబుగా—"పుట్టుక, వివాహము, మృత్యువు—ఈ సందర్భాలలో నేను ఉపవాసం చేయించే సంగతి నీకు తెలియునుగదా? శుభకార్యాలప్పుడెప్పుడూ నేను ఉపవాసము చేయిస్తాను. నేటినుండి మన బాధ్యత ఎంత హెచ్చిపోతున్నది? ఏకాదశీ ఉపవాసంవల్ల మనస్సు భక్తివైపు మ్రొగ్గినట్లు నేటి ఉపవాసంవల్ల మనకు మన బాధ్యతలు బాగా గుర్తుకు వస్తాయి. మనకు స్వాతంత్ర్యం

సంపాదించిన ఆయుధం రాట్నం. ఈనాడు దానిని మనం మరచుటెట్లా? మరి మౌనవ్రతం ఎందుకంటావేమో? అది మనం ఈశ్వరుని—'ఓ పరమేశ్వరా! నేటినుండి నీవు సర్వదా మాకున్న గురుతర భాధ్యతల జ్ఞానం మాకు కల్గించు చుండుము. అధికార ప్రాప్తి తర్వాత మేము భోగ విలాసాదు లలో పడిపోకుండునట్లు చేయుము' అని ప్రార్థించుటకు. ఏ విధమైన గర్వానికి మనం లోనుకాకూడదు. నేటినుండి మనమంతా ఇంకా వినమ్రులమై పోవాలి," అని చెప్పినాడు.

అట్లు చెప్పునప్పుడు 'బాపు' ముఖం గంభీర ముద్ర దాల్చింది. అరగంటలో విషపూరితమైన వాతావరణాన్ని ఆయన అమృతమయం గావించాడు. కాని ఆయన ముఖ మందు దాని చిహ్నమే లేదు. ఆయనకు తానేమీ చేసినట్లే లేదు. ఎవరైనా అభినందించితే—ఆయన—"ఏకాకిగా మనిషి ఏమి చేయగలడు? నన్నెందు కభినందించుతున్నారు? మీరంతా సహాయం చేశారు. దానివల్లనే ఇది జరుగుట సంభ వించింది," అని అనేవాడు.

ఆనాడు మేమంతా 'బాపు' తో సహా ఉపవాసం చేశాము. నూలు వడికే కార్యక్రమం పెట్టుకొన్నాము. బెంగాలు ప్రాంతపు మంత్రు లందరూ 'బాపు' నకు ప్రణామం చేయటానికి వచ్చారు. వారందరితో ఆయన—"చూడండి!

ఈ రోజు నుండి మీరందరూ ముండ్లకిరీటాల ధరిస్తున్నారు. ఇంతవరకు మీ రెంత నిరాడంబరంగా ఉన్నారో, ఇక ముందు కూడ అంత నిరాడంబరంగానే ఉండండి. అధికారం చాలా చెడ్డది. కొంచమైన గర్వపడ వద్దు. భోగ విలాసాదులలో చిక్కుకొన వద్దు. నిరాడంబర జీవితంలో, నమ్రతలో, అహింసలో, సహనశీలతలో ప్రజలకు మీరు ఆదర్శంగా ఉండాలి. గ్రామాలను మీరు పునరుద్ధరించాలి. సత్యాన్ని ఎన్నడూ వదల వద్దు. మీకు నిజమైన పరీక్ష నేటినుండే. ఆంగ్లేయుల రాజ్యంలో ఒక విధంగా చూస్తే మీకు పరీక్షే లేకుండింది. నేటినుండి మీకు అన్నీ పరీక్షలే పరీక్షలు. ఈశ్వరుడు మిమ్ముల సఫలీకృతులు గావించుగాక!" అని బోధించి నాడు.

1947 ఆగస్టు 15వ తేదీ శుక్రవారమైంది. ఒక ఏడాది తర్వాత మనకట్టి సద్బోధ గావించుటకు 'బాపు' మనకు లేడు! తన పనిని పూర్తి చేసుకొని, తన భవిష్యద్వాణి ప్రకారం శుక్రవారం నాడే హిందువులకు భక్ష్యమై పోయినాడు. ఈ మన పాపానికి 'బాపు' ఆ నాడు మనకు చెప్పిన మాటల జ్ఞాపకం చేసుకొని ప్రాయశ్చిత్తం చేసు కొందుము గాక! ఆ మహాపురుషుడు చూపిన మార్గాన పోవు శక్తిని ఈశ్వరుడు మనకు ప్రసాదించుగాక!

## ౧౫. 'బాపు' జన్మ దినములు

'బాపు' జన్మ దినములని కావాలనే, నేను బహు వచనంలో వ్రాశాను. ఇంగ్లీషు తారీఖుల ప్రకారం ఆయన జన్మ దినం అక్టోబరు రెండవ తేదీన వస్తుంది. తిథుల ప్రకారం భాద్రపద బహుళ ద్వాదశి నాడు అవుతుంది. 1947వ సంవత్సరంలో తేదీల ననుసరించి వచ్చే జన్మ దినం తిథుల దానికంటె ముందురావటం జరిగింది.

నేడా జన్మ దినాలు, 'బాపు' లేనందువల్ల అంధకారమయములై పోయినాయి. క్రిందటి ఏడు ఈనాడు—"వచ్చే చరఖా (రాట్నం) ద్వాదశికి భారతదేశం పూర్తిగా మారిపోవుటమైనా జరుగుతుంది. లేదా నేను లేకుండానైనా పోతాను," అని 'బాపు' భవిష్యద్వాణిని పలికినాడు. కాని ఆయన చెప్పింది నిజమైపోతుందని ఎవరు అనుకున్నారు.

బిడలా హౌస్.
గురువారం, 2-10-1947.

మూడు గంటల ముప్పది నిమిషాలకు ప్రార్థన కొరకు లేచాము. మేము లేచేటప్పటికే ఆ ఇంటిలోని వారందరూ అక్కడికి చేరినారు. మొగము మొదలైనవి మేమంతా కడుగుకొని, ఒకరి తర్వాత ఒకరం 'బాపు' పాదములంటి ప్రణామం

చేశాము. నేను నవ్వుతూ 'బాపు' తో—"ఇదెక్కడి న్యాయం? మా పుట్టిన రోజునా మేము అందరికాళ్లకు మ్రొక్కుతాము. మీ జన్మదినం నాడుకూడా మీ పాదములకు మేమే నమస్కరించవలసి వస్తున్నది," అని అన్నాను. దానికి 'బాపు'—"అవును. మహాత్ములపట్ల సాధారణ నియమాలన్నీ తారుమారుగా వర్తిస్తాయి. మీరంతా నన్ను మహాత్మునిగా చేశారుగదా? నేను నిజంగా మహాత్ముడిని కాక పోయినా మీరంతా మహాత్ముడనని అనటంవల్ల మామూలు మర్యాదల కన్నింటికీ నేను అతీతుడనై పోయాను," అనిజవాబు చెప్పినాడు.

ఆ దినములలో 'బాపు' దగ్గుతో, జ్వరంతో, జలుబుతో బాధ పడుతుండేవాడు. చూచేవారికి బాధ కలిగేటంత ఎక్కువగా ఆయనకు దగ్గు వచ్చేది. అయినప్పటికిని ప్రార్థన తర్వాత ఆయన మరల నిద్రపోలేదు. ప్రతిరోజు వలె ఉత్తరాలను, హరిజన పత్రికలకు వ్యాసాలను వ్రాయుటకు కూర్చొని నాడు.

బాపునకు వచ్చిన దగ్గు మూడు వారాలు ఉండే దగ్గు. అయినా ఆయనకు నొప్పి కొంచం తగ్గటానికి డాక్టర్లు 'పెన్సిలిన్' ఇంజక్షనుల తీసుకోవలసిందని సలహా నిచ్చారు. దాని విషయమై 'బాపు' నకు డాక్టర్లకు వాదం జరిగింది. "నా రాము

నామం సంగతి ఏమిటి? అది హృదయమంతా నిండిఉంటే— దాని శక్తివల్ల దగ్గు రేపే రూపులేకుండా పోతుంది. అట్లా గాక మూడు వారాలవరకు ఆ దగ్గు ఉంటే నా రామనామం ఎందుకు కొరగానిదని లోకానికంతా చాటేందుకు నేను సిద్ధం," అని 'బాపు' అంటాడు. డాక్టరులు—" అది అంతా సరే. విజ్ఞాన శాస్త్ర పరిశోధనలు అబద్ధమని మీరు ఎట్లా చెప్పగలరు? రామనామం హృదయపూర్వకంగా జపించేవాని నెవ్వనినైనా తీసుకోనిరండి. ఆయనలో కలరా క్రిముల మేము వ్యాపింపచేయగలము," అని అంటారు. "ఇది ఉద్దండత. విజ్ఞాన శాస్త్రం ఇంకా ఎంతో పరిశోధించవలసి ఉంది. ఇప్పుడే అది మొదలైంది. ఇక శ్రద్ధతో రామనామం జపించితే ప్రపంచంలో ఎవ్వరూ జబ్బే పడబోరు. లోకంలోని ప్రజలు అంత శుద్ధులు, నిష్పాపులు అయిపోతే ఎవరికి ఏ రోగం రాదని నాకు పూర్తిగా నమ్మకం ఉంది. కాని మీరంతా పొరబడుతున్నారు. రేపు నాకు మీరు 'లివర్' లేక లివర్ ఎక్‌స్ట్రాక్టు ఇంజక్షనులు ఇస్తామంటే, విదేశాలలో తయారైన వాటిని నేను తీసికొనవలసిందేనా? భారత దేశంచాలా సోమరి దేశం. అందులో డాక్టరులు మరీ అందరికంటె సోమరిపోతులు. తమ దేశంలో వారు ఏ మందులు సిద్ధంచేయలేరు. విదేశాలలో సిద్ధం చేయబడిన వస్తువులందే వారికి నమ్మకం. ఎంత దౌర్భాగ్య స్థితి!

మన దేశం బిచ్చగాండ్ల దేశమా? ప్రకృతి సర్వం ఇచ్చినా మనం తిరిపెము ఎత్తుకోవలసి వస్తున్నది. నిజంగా ఈ విషయాలను గురించి ఆలోచిస్తేనాకు ఎంతో దుఃఖం వస్తుంది. అట్టి భాగ్యం భారతదేశానికి ఎప్పుడు పట్టవలసిఉందో అప్పుడే అదిపట్టగలదు. ఇప్పుడు ఏమని ఏమి లాభం? నేను చాలా చేశాను. ఇక ఇప్పుడు ఏమిచేయటానికి నాకిచ్ఛలేదు. ఈ లోకంనుండి పోవాలని ఉంది. అదికూడా రామ—రామ— అని అంటూనే. రామ నామంలో ఎంత మహాత్వముందో మీకు నేను చెప్పజాలను. నా కంతటి సామర్థ్యం లేదు. ఇప్పుడు నేను కుమ్మరి ఆవములో కూర్చొని ఉన్నాను. నాల్గువైపుల అగ్ని మండు తున్నది. మీరు, డాక్టరులు— విజ్ఞాన శాస్త్రంలో ఎట్లు పరిశోధనలు సల్పుతున్నారో అదే మాదిరి నేనుకూడ రామనామ మహత్వమును తెలిసికొన పాటుపడుతున్నాను. తెలిసికొన గలిగితే సరే—లేకపోతే ఆ ప్రయత్నంలోనే ప్రాణాలర్పించు తాను. అక్టోబరు రెండని నేడు నాకు నమస్కరించేందుకు మీరంతా వచ్చారు. నాకు మంచిదని మీకు తోచినదానిని మీరు చెప్పుచున్నారు. ఇదంతా మీకు నాయందుగల ప్రేమను తెలుపుతుంది. కాని, ముందు సంవత్సరం వచ్చే చరఖాజయంతి నాటికి ప్రజ్వలించి పోతున్న ఈ అగ్నిని చూడటానికి నేను లేకుండానైనా

పోవాలి లేదా భారతదేశం యొక్క రూపం పూర్తిగా మారి పోనైనా పోవాలి.' అని నేను కోరుతున్నాను. అందుచేత నాకు దీర్ఘాయువుకొరకు మీరు ప్రార్థించకుండా, నేను దేని కోసం భగవంతుని ప్రార్థిస్తున్నానోదాని కొరకే మీరు ప్రార్థించండి," అని 'బాపు' అన్నాడు.

1947 సం॥ అక్టోబరు 2వ తేదీ ఉదయం అయిదున్నర గంటలకు పై మాటలు 'బాపు' చెప్పింది.

ఏదైనా శుభకార్య మప్పుడు అమంగళకరమైన మాటలు పల్కరాదని, ఎవరిమీద కోపపడరాదని, ఏడువ కూడదని మనవాళ్లు అంటారు. నా డైరీలో 'బాపు' అన్న పై మాటలు చదివినప్పుడు మనవాళ్లు చెప్పేదాంట్లో కొంత నిజం ఉందని నాకనిపిస్తున్నది. రామనామ సాధనలో మున్గి తేలే 'బాపు' ఆ రామనామం జపించుతూనే వెళ్లిపోయాడు!

ఏడుగంటలకు మేము 'బాపు' తో వాహ్యాళికి వెళ్లి నాము. మేము నడుస్తుండగానే ఒక ఆంగ్లేయ సోదరుడు 'బాపు' ఫోటో తీసేందుకు ప్రయత్నించాడు. 'బాపు' నకు కోపం వచ్చింది. ఫోటో తీసుకొనేవారు ఎన్నోసారులు ఆయనకు చాలా విసుగు పుట్టించారు. కాబట్టి వారంటేనే 'బాపు' నకు కొంత విసుగు, కోపం కూడాను. ఆయన—

"ఇది ప్రార్థనలో గడప వలసిన రోజు. దానికి బదులుగ ఇదా ?" అని నొచ్చుకొన్నాడు.

ఇంతలో కృపలానీగారు, సోదరి సుచేతా కృపలానీ, మున్నగు వారెందరో 'బాపు' నకు నమస్కారం చేసేందుకు వచ్చారు. 'బాపు' తో సహా మేమంతా ఉపవాసం చేశాము. నేను 'బాపు' ను—"మీరెందుకు ఉపవాసం చేస్తున్నారు ?" అని ప్రశ్నించాను. ఆయన జవాబుగా—"నేడు చర్ఖా లేక రాట్నముయొక్క జన్మదిన మని చెప్పాలి. ఈ రాట్నము పరోపకార మొనర్చే దైవము. ఇది పుట్టినరోజున ఉపవాసం చేసి, పవిత్రులమై పదేపదే—"ఓరాట్న దైవమా ? మాకు శరణిమ్ము" అని మనం ప్రార్థించాలి. ఇట్లు ప్రార్థించేందుకే నేను ఉపవాసం చేశాను. అంతేకాని నేడు నా జన్మదిన మని, దానికేదో మహాత్వముందని నేను అనుకొనుటవల్ల కాదు," అని చెప్పినాడు.

వాహ్యాళి తర్వాత స్నానాదికములనుండి 'బాపు' నకు ఎనిమిదిన్నరకు తీరుబడి అయింది. మీరాబహెన్ ఆయన కూర్చొన్న గదిముందు పుష్పములతో కళామయముగు రీతిని ఓం !, హేరామ్ !, క్రాసును (+) తయారు చేసింది. మే మంతా 'బాపు' మెడలో పూలదండలు వేసి, ఆయన పాద పద్మములంటుకొని ప్రణామము లర్పించాము. పిమ్మట చిన్న

ప్రార్థన చేశాము. ప్రార్థన జరుగుతుండగా జవాహరలాల్, ఇందిరా గాంధి, తన కుటుంబముతో సహా ఘనశ్యామదాసు బిడలా, కన్హయలాల్ మున్షీ, సి. హెచ్. భాభా, డాక్టరు జీవరాజ్ మెహతా, సర్దారు వల్లభాయిపటేలు మొదలగు వారందరితో ఆగది నిండిపోయింది. అన్నిమతాల ప్రార్థనలూ గావించబడిన తర్వాత వచ్చిన వారందరూ వెళ్లిపోవుటా జరిగింది. 'బాపు' నకు దగ్గు రావటం మొదలైంది.

అక్కడ ఉన్న ఒక సోదరుడు—"బాపూ' మీ దగ్గు ఇంకా పోలేదు" అన్నాడు. దానికి—"రాముడుంటే ఇది పోతుంది. లేకపోతే నేను దగ్గుతో చనిపోవ గోర్తాను. 125 ఏండ్లు బ్రతకాలని నాకిప్పుడు లేదు. మీారందరూకూడ 'ఓ భగవంతుడా! భారతదేశానికి సద్బుద్ధినైనా ఒసంగుము, లేదా ఈ ముదుసలిని ఈ దావానలమునుండియైనా తప్పించు,' అని ప్రార్థించాలి. ఇంగ్లీషువారితో చేసిన ఇన్నిపోరాటాలలో నేనెప్పుడు నిరాశుడ కాలేదు. కాని ఇంటి వ్యవహారాలను ఎవరితో చెప్పను? సోదరుడు సోదరుని చంపగోరుతున్నాడు. దీనిని చూస్తూ బ్రతికిఉండాలని నాకు లేదు" అని ప్రత్యుత్తర మిచ్చాడు.

వీరంతా పదిగంటలకు వెడలిపోయారు. 'బాపు' నకు ప్రణామం చేసేందుకు ఎందరో వస్తూనే ఉండిరి. కాకా

సాహేబ్ గాడ్గిల్, దేవదాసు గాంధి తన కుటుంబంతో, భట్నాగర్, సర్ దాతార్ సింహ్, ఆర్థర్ మూర్, షణ్ముఖం చెట్టిగార్లు కూడా వచ్చారు. తర్వాత 11 గం॥ 45 నిమిషాలకు సర్దార్ పటేలు, మణిబహాన్, గణేశదత్త్, ప్రొఫెసర్ అబ్దుల్ మజీద్ వచ్చారు. పిమ్మట బర్మా హైకమిషనర్ హెచ్. ఎల్. ఎ. ఆంగ్; చీనాదేశపు హైకమిషనర్ డాక్టర్ ఎమ్. ఆంగ్ సూ చనుదెంచారు. వారు తమతమ ప్రధాన మంత్రులనుండి వచ్చిన అభినందన లేఖలను, ఫలములను తీసికొని వచ్చారు. వీరందరితో కలిసి మాట్లాడినమీదట అతి కష్టంమీద 12 గం॥ 30 నిమిషాలకు 'బాపు' నకు విశ్రాంతి తీసుకొనేందుకు అవకాశం చిక్కింది. పదిహేను నిమిషాలైనా పడుకొన్నాడో లేదో అంతలో దర్శనార్థులతండాలు రాసాగినవి. పగలు రెండు గంటలనుండి మూడు గంటలవరకు అందరం సమిష్టిగా నూలు వడికినాము. 4 గం॥ 10 నిమిషాలకు లేడీ మౌంటు బ్యాటన్ వచ్చింది. ఆవిడ వెళ్లిపోయిన తర్వాతకూడ హుమాయూన్ కబీర్, శ్రీధరాణి, ఫ్రాంసు దేశస్థులగు మస్సూర్ లోజియర్ దంపతులు వచ్చారు. దేశ విదేశాల నుండి దాదాపు వేయికంటె ఎక్కువ టెలిగ్రాములు (తంతి వార్తలు) వచ్చాయి. 'బాపు' పాదముల సన్నిధినైతే పెద్ద కుప్పగ రూపాయలు ప్రోగుబడినాయి. సోదరీమణులెందరో తమ నగలనుగూడ ఇచ్చివేసి వెళ్లిపోయారు.

అక్టోబరునెల రెండవరోజు మహానందంగా గడచిపోయింది. రాత్రి రేడియోలో బహు సుందరమైన కార్యక్రమం ఉండింది. నేను 'బాపు' తో "ఈనాడైనా మీరు రేడియో వినండి," అని అన్నాను. అందులకు 'బాపు' "దానిలో ఏముంది? భజన కీర్తనల కొరకు రేడియో వినటంకంటె రెంటెయో (గుజరాతీ భాషలో రెంటెయో అంటే రాట్నమని అర్థం) సంగీతం వినటం బాగుండదా?" అని అన్నాడు.

ఢిల్లీలోనున్న గుజరాతీవారు భాద్రపద బహుళ ద్వాదశినాడు అనగా 'బాపు' జన్మతిథినాడు—అనగా చర్ఖా జయంతినాడు ఆయన కొసంగుటకై చందాలు వసూలుచేసి నిధి నేర్పాటు చేశారు. ఆనాడుకూడ 'బాపు' ఒంట్లో బాగుండలేదు. దానినిచూసి సర్దారు పటేలు—"దగ్గు ఇంత బాధ పెడుతుంటే గుజరాతీవారి సభకు వెళ్లుటకు మీరెందు కంగీకరించారు? మరచాను. మీరా పరమ లోభులు. ఎక్కడైనా డబ్బు దొరకుతుందని తెలిస్తే చాలు—ప్రాణం పోతున్నాసరే అక్కడికి వెళ్లితీరుతారు. ఇట్టి నిధులు గిధులు అనేకం వస్తూ పోతూ ఉంటాయి. అడుగడుగునకు దగ్గుతూ మీరు రక్కడికి వెళ్లవలసినంత అవసరం ఏముంది? కాని నేనెంత చెప్పినా ఏమీ లాభం లేదని నే నెరుగుదును. మీరు

నా మాటలను పాటించరు," అని నర్మోక్తులాడినాడు. ఆయన మాటలు వింటుంటే మాకు కడుపు పట్టలేనంత నవ్వు వచ్చింది. ఎంతో ఆనందం కలిగింది. పటేలు 'బాపు' లకు గల సంబంధ మంత మధురమైనది.

మరి ఆనాటి సభలో సర్దారును ఏమైనా మాట్లాడమని అడిగి నప్పుడు—అక్కడకూడా హాస్యరసం వెల్లివిరిసింది. సర్దారు—"ఈరోజు నా జన్మదినమైతే కాదుకదా? ధనం ప్రోగుచేసి మీరైతే ఇచ్చేది ఈ మహాత్మునకు—ఇక మాట్లాడవలసింది నేనా? 'బాపు' వైశ్యుడు. వైశ్యులు మహా లోభులు. నామాట నిజంకాదేమో చూడండి! ఇంత దగ్గుగా ఉన్నా, నీరసంగా ఉన్నా, మిమ్ములను మోసంచేసి డబ్బు లాగేందుకు ఆయనకు ఎక్కడలేని ఓపిక వచ్చింది. (పెద్దపెట్టున నవ్వు) ఇప్పుడు నా ప్రార్థన ఒక్కటే. ఈయనను విశ్రాంతి తీసికొననీయండి." అని అన్నాడు.

'బాపు' రాట్నాన్ని ఇంకా అధికంగా ప్రచారంలోనికి తీసికొని రావలసిందని ప్రజలను హెచ్చరించాడు.

ఆ సంవత్సరం 'బాపు' జన్మ దినం ఎంత మహా వైభవంగా జరుపబడిందో—అంతటి అంధకారంలో ఇకముందు ఆయన జన్మదినములు జరుప బడగలవు. అయితే కటిక

చీకటిలో దీపం యొక్క జ్యోతి ఎంతో ప్రకాశం ఇస్తుంది. దానిని చూచి మనం సంతోషిస్తాము. అదేవిధంగా మనం నిత్యం 'బాపు' ను స్మరించుకొంటూ ఆయన చూపించిన మార్గం వెంటపోతూ ఉంటే దివ్యపథమును మనకాయన చూపించగలడు. అట్టి ఆశతోనే మనం సంతృప్తి పడవలసి ఉంటుంది.

'ఈశ్వర అల్లా తేరే నామ్
సబకో సన్మతి దే భగవాన్'

ఇది ఆయనకు ప్రియమైన ప్రార్థన. దీనిని ఆయన ప్రతి దినంచేస్తూ ఉండేవాడు. ఆ ప్రార్థననే మనం నేడు చేయుదము గాక! ఆయనకు ప్రణామము లర్పించెదము గాక!

"భారతదేశం పరిశుద్ధమైనా కావాలి లేదా నేనైనా ఉండకుండా పోవాలి," అని మనల ప్రార్థించమని క్రిందటి చర్ఖాజయంతినాడు 'బాపు' మనలకు చెప్పి ఉండెను. మనం అదే ప్రార్థన చేసి—"మాకు సత్యమార్గమును చూపించుము. మా పాపములవంక చూడకుము," అని 'బాపు' ను, భగవంతుని కోరెదముగాక!

---